# గాంధీజీ ప్రాణరక్షకుడు
# బతఖ్ మియా అన్సారి

సయ్యద్ నశీర్ అహమ్మద్

ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్
ఉండవల్లి - 522501

# గాంధీజీ ప్రాణరక్షకుడు : బతఖ్ మియా అన్సారి

BATAQ MIYA ANSARI : SAVIOUR OF GANDHIJI


## సయ్యద్ నశీర్ అహమ్మద్

Syed Naseer Ahamed





ప్రచురణ సంఖ్య : 15

ప్రథమ ముద్రణ : 2019

ముఖచిత్రం : నలబోతుల జయరాజు, వినుకొండ

ముద్రణ : జయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ

ప్రతులకు :

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**

సి 2, శ్రీరామ్స్ ఆర్కేడ్, అమరావతి రోడ్ ఉండవల్లి - 522501

తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

సంచారవాణి : 9440241727

E Mail:

naseerahamedsyed@gmail.com,

aazadhouseofpublications@gmail.com

**మూల్యం : 25-00**

**అ**ది 1917.

మహాత్మాగాంధీ ఏప్రిల్ 15 సాయంత్రం మూడు గంటల ప్రాంతంలో బీహార్ రాష్ట్రం ముజఫర్‌పూర్ నుండి రైలులో చంపారన్ జిల్లా కేంద్రమైన మోతిహార్ రైల్వేస్టేషన్ చేరుకున్నారు. పలు గ్రామాల నుండి విచ్చేసిన నీలితోటల, భూముల రైతులు ఆయనకు ఘన స్వాగతం పలికారు. శతాబ్దికాలం నుండి నీలి పంట పండించే తోటలకు, ఆ పంట నుండి నీలి మందును తయారు చేసే కర్మాగారాలకు చంపారన్ ప్రాంతం ప్రసిద్ధి. అత్యధిక నీలి మందు కర్మాగారాలకు, నీలి తోటలకు ఆంగ్లేయులు యజమానులు. భారత రైతాంగం చిన్నకారు–సన్నకారు రైతులు. ఆంగ్లేయ ప్రభుత్వంలో ఆంగ్ల యజమానులు ఆడింది ఆట, పాడింది పాట. రైతులలో అత్యధికులు కౌలు రైతులు. భూములు, కర్మాగారాలు తమ అధీనంలో ఉండటంతో నీలి పంట, నీలి మందు తయారి నుండి లాభాలను పండించుకునేందుకు ఆంగ్లేయ యజమానులు చంపారన్ రైతాంగం ప్రయోజనాలకు వ్యతిరేకంగా వ్యవహరించసాగారు. ప్రధానంగా 'తీన్ కతియా' (TIN KATHIA) ఒప్పందాన్ని వారి మీద రుద్దుతూ, తావాన్, జిరాత్, అబ్‌వాబ్ లాంటి వివిధ రకాల పన్నులను బలవంతంగా వసూలు చేయసాగారు. బెగార్ భూస్వామ్యపద్ధతి ప్రకారంగా రైతుల శ్రమను దోచుకుంటూ వారిని వెట్టిచాకిరీకి గురిచేయసాగారు.

ఆంగ్లేయ యజమానుల అక్రమ పద్ధతుల మీద నిరసన తెలిపినా, కాదన్నా, సాహసించి ఎదిరించినా ఆంగ్లేయ యజమానులు, వారి గుమాస్తాల క్రూరత్వానికి రైతాంగ కుటుంబాలు గురి కావాల్సిందే, బహిష్కరణలకు బలికావాల్సిందే. ప్రభుత్వం, అధికారవర్గంలో ఆంగ్లేయుల మాట చెల్లుబాటు కావడంతో రైతులు నిస్సహాయులయ్యారు. ఆంగ్లేయ యజమానుల ఆధిపత్యం, అకృత్యాలు హద్దులు మీరడంతో సహనం నశించిన రైతాంగం అప్పుడప్పుడు ఎదిరించి ఉద్యమించినా, ఆంగ్లేయాధికారుల అండదండలతో ఉద్యమాలను క్రూరంగా అణిచి వేయడం, ఉద్యమించిన రైతాంగ నేతలను అష్టకష్టాల పాల్జేయడం ఆనవాయితి అయ్యింది.

ఈ దారుణ పరిస్థితుల నుండి బాధిత రైతాంగాన్ని ఆదుకోడానికి చంపారన్ ప్రాంతానికి చెందిన రాజ్ కుమార్ శుక్లా (1875–1929), పీర్ ముహమ్మద్ 'మూనిస్' అన్సారి (1882–1949) లు చేసిన ప్రత్యేక విజ్ఞప్తుల మేరకు మహాత్మా గాంధీ మోతిహార్ విచ్చేశారు. మహాత్ముడు మోతీహార్ చేరుకున్న మరుసటి రోజు నుండే కార్యాచరణకు దిగడంతో పెద్ద సంఖ్యలో చంపారన్ రైతులు

ఆయన వద్దకు విచ్చేసి నీలితోటల, నీలిమందు కర్మాగారాల యజమానుల దుర్మార్గాలను పూసగుచ్చినట్టు ఏకరువు పెట్టసాగారు.

ఆంగ్లేయ యజమానులు ఊహించని విధంగా, బాధిత రైతాంగం ఎటువంటి భయం, బెరుకూ లేకుండా ఆంగ్లేయ యజమానుల అకృత్యాలను బహిరంగ పర్చసాగారు. ఆ ప్రతికూల పరిస్థితిని గమనించిన ఆంగ్లేయ యజమానులు మహాత్మాగాంధీ కార్యాచరణకు చరమగీతం పాడాలనుకున్నారు. ఆంగ్లేయ ప్రభుత్వాధికారులను, ఆంగ్ల న్యాయస్థానాలను రంగంలోకి దించారు. మహాత్ముడు అనుసరించిన శాంతియుత సత్యాగ్రహోద్యమాన్ని ఇటు పోలీసులు కానీ, అటు న్యాయస్థానాలు కానీ కట్టడి చేయలేకపోయాయి. ఆంగ్లేయాధికారుల దండన, శిక్షల భయం మరచిపోయి ఆంగ్ల యజమానుల క్రౌర్యాన్ని, ఆర్థిక దోపిడిని బహిరంగంగా సాక్ష్యాధారాలతో సహా రైతులు ప్రకటిస్తూ రావడంతో ఆంగ్లేయ యజమానులలో గుబులు ప్రారంభమైంది.

ఆ గుబులు పర్యవసానంగా మహాత్మాగాంధీని చంపారన్ నుండి తొలగించాలని ఆంగ్లేయ యజమానులు నిర్ణయించారు. ఆంగ్లేయ యజమానులలో అతి దుర్మార్గుడుగా పేర్గాంచిన 'ఇర్విన్' రంగంలోకి దిగి పథకం రూపొందించాడు. ఆ పథకం ప్రకారంగా మహాత్మాగాంధీని తన ఇంటికి విందుకు పిలిచి విషాహారంతో ఆయనను అంతం చేయానులకున్నాడు. మన కంటిని మన వేలితో పొడిచి తన కార్యం సాధించుకోవాలని పథకం రూపొందించాడు. తన ఇంటి వంట మనిషి బతఖ్ మియా అన్సారి (1867-1957) ని రంగంలోకి దించాడు. ఆయనను పిలిచి తన ఇంటికి విందుకు వస్తున్న గాంధీజీకి పాలల్లో విషాన్ని కలిపి ఆయనకు ఇవ్వాలని ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞానుసరణకు సంశయిస్తున్న బతఖ్ మియాను భూరి ఇనాములతో ముంచెత్తుతానని, మంచి జీతం ఇవ్వగలనని, భూమి అందచేస్తానని ఇర్విన్ వాగ్దానం చేశాడు. ఆజ్ఞోల్లంఘనకు భయానక పరిణామాలను ఎదుర్కోవాల్సి వస్తుందని తీవ్రంగా హెచ్చరించాడు. అత్యంత క్రూరుడుగా ఖ్యాతి గడించిన ఆంగ్లేయ యజమాని దుష్టబుద్ధిని, ఆగ్రహాన్ని చవిచూసి ఉన్న బతఖ్ మియా అన్సారి ఏమాత్రం సమాధానం ఇవ్వకుండా మిన్నకుండి పోయాడు.

ఆ పథకం మేరకు మహాత్ముడు, ఆయన అనుచరులను ఇర్విన్ తన ఇంట విందుకు ఆహ్వానించాడు. ఆంగ్లేయుడి ఆహ్వానం వెనుకనున్న కుట్రను ఏమాత్రం శంకించని మహాత్ముడు తన సహచరుడు, న్యాయవాది బాబూ రాజేంద్ర ప్రసాద్‌తో కలసి విందుకు హాజరయ్యారు. ఆ సమయంలో బతఖ్ మియా అన్సారి నేరుగా మహాత్ముడి సమక్షానికి వచ్చి తన యజమాని ఇర్విన్ కుట్రను బట్టబయలు చేస్తూ పాలలో విషం కలిపిన విషయాన్ని గాంధీజీకి తెలిపారు. బతఖ్ మియా అన్సారి సాహసం వలన మహాత్ముడు ఇర్విన్ చేసిన ప్రాణాంతక కుట్ర నుండి బయటపడ్డారు.

మహాత్మాగాంధీని అంతం చేయడానికి తాము పన్నిన పన్నాగం విఫలం కావడం, అది కూడా తన ఆజ్ఞలను ఉల్లంఘించిన తన ఇంటి వంటమనిషి వలన కుట్ర బహిర్గతం కావడంతో ఆంగ్లేయుడు ఇర్విన్ ఉగ్రుడయ్యాడు. ఆ ఆగ్రహం బతఖ్‌మియా అన్సారీని భయానక భౌతిక హింసలకు గురి చేసింది. ఆయన ఉద్యోగం ఊడిపోయింది. అయన ఆస్తిపాస్తులు జప్తు అయ్యాయి. ఆయన ఇంటిని వేలం వేశారు. ఆంగ్ల పోలీసులు ఆయనను ఆరెస్టు చేసారు. ఆయనను భయానక

హింసకు గురిచేశారు. చివరకు అన్సారి కుంటుంబాన్ని స్వగ్రామం సిస్వా అజ్‌గరి (Siswa Ajgari) నుండి ఇర్విన్ వెళ్ళగొట్టించాడు. ఆంగ్లేయుల పీడన నుండి రైతులను విముక్తం గావించడానికి చంపారన్ విచ్చేసిన మహాత్మా గాంధీని ఆంగ్లేయుల ప్రాణాంతక కుట్రకు బలి కానివ్వకుండా రక్షించగలిగినందుకు సంతోషిస్తూ బతఖ్ మియా అన్సారి అన్ని ఇక్కట్లు భరిస్తూ స్వగ్రామం వదలి కుటుంబంతో సహా ఎటో వెళ్ళిపోయారు.

ఆ విధంగా ఆంగ్లేయ ప్రభుత్వానికి చరమగీతం పాడేందుకు స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన మోహన్ దాస్ కరంచంద్ గాంధీ, ఆంగ్లేయులు పన్నిన విషప్రయోగం కుట్ర నుండి బతఖ్ మియా అన్సారి నిర్భయత్వం, సాహసం వలన 1917లో సురక్షితంగా బయట పడ్డారు. ఆంగ్లేయ యజమానుల మృత్యుకుహరం నుండి గాంధీజీని బయట పడేసిన సాహసి బతఖ్ మియా అన్సారీ చంపారన్ జనబాహుళ్యంలో కలసి కనుమరుగైపోయారు.

◆ ◆ ◆

**1**757లో ప్లాసీ యుద్ధం తరువాత ఆంగ్లేయులు తమ దోపిడిని యధేచ్ఛగా సాగించారు. ఆనాడు వస్త్ర పరిశ్రమ, అద్దకం పరిశ్రమలో ఎంతగానో ఉపకరిస్తున్న నీలి మందు ఉత్పత్తి, ఎగుమతిని ముమ్మరం చేశారు. బెంగాల్ పరగణాలో ఆరంభించిన నీలి ఉత్పత్తి, ఎగుమతిని క్రమంగా బీహార్‌కు విస్తరింపజేశారు. బీహార్ రాష్ట్రం చంపారన్ ప్రాంతంలో నీలి పంట, నీలిమందు ఉత్పత్తిని కేంద్రీకరించిన ఆంగ్లేయులు ఆంగ్ల ప్రభుత్వం, ఆంగ్లేయ అధికారుల అండదండలతో భూముల మీద ఆధిపత్యం సంపాదించారు. అత్యధిక లాభాలు ఆర్జించాలనుకున్న ఆంగ్లేయులు తాము కోరినంత విస్తీర్ణంలో నీలి పంటను పండించాలంటూ, తాము నిర్ణయించిన ధరలకు పంట సరఫరా చేయాలంటూ రైతుల మీద ఆంక్షలు విధించారు. భూమిని 24 భాగాలు చేసి అందులో మూడు భాగాల ప్రాంతంలో తప్పనిసరిగా నీలి పంటను పండించాల్సిందేనంటూ 'తీన్ కతియా' ఒప్పందాన్ని రైతుల మీద బలవంతంగా రుద్దారు. ఆ ఒప్పందాల అమలు, ఉల్లంఘనలను నిర్ధేశిస్తూ, నియంత్రిస్తున్న క్రమంలో 40 రకాల పన్నులు, జరిమానాల వసూళ్ళను ఆరంభించారు.

అంతర్జాతీయ మార్కెటు పరిణామాల మూలంగా, వాతావరణం భౌగోళిక పరిస్థితులలో వచ్చిన మార్పుల వలన నష్టాలు సంభవిస్తే ఆ నష్టాలను పూడ్చుకునేందుకు వివిధ రకాల సరికొత్త వసూళ్ళ సాగించారు. ఆ ఆర్థిక-మానసిక దోపిడి పట్ల రైతాంగం నిశ్శబ్దంగా నిరసిస్తున్నా ఆంగ్లేయ యజయానులకు ఆంగ్ల ప్రభుత్వాధికారుల, పోలీసుల మద్దతు ఉండటంతో రైతులు ఏమీచేయలేక పోయారు. ఆ నిస్సహాయత ఆసరాగా ఆంగ్ల యజమానులు, సిబ్బంది ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తూ రైతాంగం ఆర్థిక జవసత్వాలను యధేచ్ఛగా పీల్చి పిప్పి చేయసాగారు. ఆంగ్లేయ యజమానుల అకృత్యాలను ప్రశ్నించగల, ఎదిరించగల వ్యక్తి, వ్యవస్థ ఏమీ లేకపోవడంతో చంపారన్ రైతాంగం ఆంగ్లేయులకు అణిగిమణిగి ఉండటం తప్ప మరేమీ చేయలేని దుస్థితికి నెట్టబడ్డారు.

మాతృభూమి మీద ఆంగ్లేయుల పెత్తనాన్ని ప్రశ్నిస్తూ స్వాతంత్ర్యోద్యమం భరత గడ్డ మీద వికసించడం ఆరంభించాక భారతీయులలో చైతన్యం స్థాయి పెరిగేకొద్ది ఆంగ్లేయల ఆధిపత్యానికి,

దాష్టికానికి, దోపిడికి గురవుతూ వచ్చిన చంపారన్ రైతాంగంలో చైతన్యం కన్పించింది. ఆంగ్లేయ యజమానులను ఎదిరించే సాహసం క్రమంగా రైతులలో పెరిగింది. ఆంగ్లేయుల అక్రమాలకు, ఆధిపత్యానికి వ్యతిరేకంగా చంపారన్ రైతులు అక్కడక్కడ తలెత్తసాగారు. ఆ వ్యతిరేకత, ఎదిరింపును అంగబలంతో, అధికారబలంతో ఆంగ్లేయ యజమానులు క్రూరంగా అణచివేస్తున్నా, మేమున్నాం... మేమున్నాం అంటూ చంపారన్ గడ్డ నుండి స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తిని సంతరించుకున్న పోరాట పటిమగల రైతు నాయకులు, రైతాంగ హితైషులు ఉద్భవించారు.

# షేక్ గులాబ్

ఆ విధంగా చంపారన్ గడ్డ నుండి పుట్టుకొచ్చిన రైతు నాయకులలో షేక్ గులాబ్ (1857-1920) ఒకరు. బీహార్ రాష్ట్రం సాతి (Sathi) పోలీసు స్టేషన్ పరిధిలోని చాంద్ బార్వా (Chand Barwah) గ్రామనివాసి. ఆయన తండ్రి షేక్ రక్తూ (Shaik Raktu) సంపన్న భూస్వామి. షేక్ గులాబ్ చిన్నతనంలో పెద్దగా చదువుకోనప్పటికి మంచి బుద్ధికుశలత గల ధైర్యశాలి. అన్యాయాన్ని అక్రమాన్ని సహించని స్వభావి. ఆ సహజ స్వేచ్ఛా-స్వాతంత్ర్య స్వభావం నుండి పరాయి పాలకుల, వారి వత్తాసుదారుల అకృత్యాలు, ఆధిపత్యాన్ని సహించని కుటుంబం నుండి వచ్చిన షేక్ గులాబ్ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సమరశంఖారావం పూరించారు.

చంపారన్ ప్రాంతంలో నీలి తోటల, కర్మాగారాల ఆంగ్లేయ యజమానుల దోపిడి, క్రౌర్యాన్ని సహించలేకపోయిన షేక్ గులాబ్ 1905లో రైతుల పక్షాన పోరాటక్షేత్రం మీదకు వచ్చారు. తొలుత తన గ్రామానికి చెందిన షేక్ మునవ్వర్‌తో కలసి ఆంగ్లేయ యజమానులకు వ్యతిరేకంగా రైతులను కూడగట్టం ప్రారంభించారు. ఆరంభంలో చుట్టుపక్కల గ్రామాలకు చెందిన జగన్ లాల్, హాఫిజ్ దీన్ ముహమ్మద్ అన్సారి (1881-1961), బాబూ శీతల్ రాయ్, హర్బన్స్ సహాయ్, హాఫిజ్ ముహమ్మద్ సాని (1888-1951) లాంటి యోధులు కలసి వచ్చారు. ఆ తరువాత విప్లవభావాలు గల కలం యోధులు పీర్ ముహమ్మద్ 'మూనీస్' అన్సారి (1882- 1949) షేక్ గులాబ్ బృందంతో చేతులు కలిపారు. ఆ రైతు నాయకుల బృందానికి మేథోపరమైన సహకారం అందించడానికి పీర్ మూనీస్ కలసి రావడంతో షేక్ గులాబ్ నేతృత్వం లోని రైతాంగ ప్రతిఘటన కొత్త పుంతలు తొక్కింది. ఆ క్రమంలో షేక్ గులాబ్, బాబూ శీతల్ రాయ్, హఫీజ్ దీన్ ముహమ్మద్, రాథేమల్, పీర్ ముహమ్మద్ మునీస్‌ల గృహాలు రైతాంగ సమస్యల చర్చలకు, వ్యూహరచనకు, సమాలోచనలకు రహస్య కేంద్రాలయ్యాయి.

ఆంగ్ల యజమానుల దుర్మార్గాలకు వ్యతిరేకంగా గొంతు విప్పిన షేక్ గులాబ్ చంపారన్ ప్రాంతంలోని రైతాంగాన్ని స్వయంగా కలసి ఆంగ్లేయుల దుష్కృత్యాలను ఎండగడ్తూ, తీన్ కఠియాను బహిష్కరించమని, అక్రమ పన్నులను, జరిమానాలను నిరాకరించమని కోరుతూ రైతులను ఏకం చేయసాగారు. ఆ సమయంలో వివిధ గ్రామాలకు చెందిన చైతన్యవంతులైన రైతులు బాబూలాల్ మిశ్రా, గణపతిరాయ్, గణేష్ రాయ్, కెన్వార్ రాయ్ తదితరులు షేక్ గులాబ్‌కు



షేక్ గులాబ్ (1857–1920)

అండగా నిలిచారు. అంతకాలం ఆంగ్లేయుల దౌర్జన్యాలను సహిస్తూ వచ్చిన రైతాంగం షేక్ గులాబ్‌లోని నిజాయితీ, నిర్భయతను చూసి ఆయన వెంటసాగారు. మతాలకు, కులాలకు అతీతంగా చంపారన్ రైతులు షేక్ గులాబ్ మాటను జవదాటని ఆజ్ఞలుగా అనుసరిస్తూ ఏకమయ్యారు.

1907 షేక్ గులాబ్ పిలుపు మేరకు సాతి (Sathi) రైతులు చంపారన్ ప్రాంతంలో తొలిసారిగా తీన్‌కతియా పద్ధతిని తిరస్కరిస్తూ, నీలి పంటను బహిష్కరించారు. అందుకు ప్రతిగా జరిమానాలను చెల్లించాలని దౌర్జన్యానికి పాల్పడిన ఆంగ్లేయ యజమానుల గుమాస్తాలు, రౌడీలను సంఘటితంగా రైతులు ఎదుర్కొన్నారు. దశాబ్దాలుగా అణిగిమణిగి పడిఉన్న రైతులు తమ ఆజ్ఞలను ధిక్కరించడం, ఎదురు నిలవడం లాంటి ఘటనలను ఆంగ్లేయ యజమానులు సహించలేకపోయారు. రైతుల పొలాలకు నీటి సరఫరాను అక్రమంగా ఆపివేయించారు. ఆ అనుచిత చర్యకు ఆగ్రహించిన షేక్ గులాబ్ నేతృత్వంలో రైతులు నిరసనలు వ్యక్తం చేస్తూ ప్రదర్శనలు నిర్వహించారు.

ఆంగ్లేయ యజమానులకు వ్యతిరేకంగా రైతాంగాన్ని సంఘటితం చేస్తున్న షేక్ గులాబ్‌ను ఇక ఉపేక్షించకూడదని ఆంగ్లేయులు నిర్ణయానికి వచ్చారు. ఆర్థిక ప్రయోజనాలు, ఉద్యోగ వసతుల ఆశలు చూపి షేక్ గులాబ్‌ను ఆయన అనుచరులను ప్రలోభపెట్టి లొంగదీసుకోవాలని పథకరచన చేశారు. షేక్ గులాబ్ ఆయన అనుచరులకు పోలీసుశాఖలో ప్రత్యేక కానిస్టేబుల్ ఉద్యోగ నియామక ఉత్తర్వులు జారీచేశారు. ఆంగ్లేయుల ప్రలోభాలకు లొంగని షేక్ గులాబ్ ఆయన అనుచరులు ఆ ఉత్తర్వులను ఖాతరు చేయలేదు. ప్రభుత్వ ఉత్తర్వులను ఖాతరు చేయని కారణంగా రైతులను నిర్బంధించి, పలు నేరారోపణలు గావించి, కేసులు నమోదు చేసి శిక్షలు విధించగా, 1908 మార్చిలో ఆ శిక్షలన్నిటిని ఉన్నత న్యాయస్థానం రద్దుచేసింది.

ఆ క్రమంలో షేక్ గులాబ్ మొట్టమొదటిసారిగా పెద్ద ఎత్తున రైతులతో తరలి వచ్చి రైతుల వెతలు, ఆంగ్లేయ యజమానుల దౌర్జన్యాలను వివరిస్తూ మోతిహార్ మేజిస్ట్రేట్‌కు మహజరు సమర్పించారు. ఆ చర్యతో ఆగ్రహించిన ఆంగ్లేయ యజమానులు ఉన్నతాధికారుల ప్రాపకంతో రైతుల మీద మరింతగా రెచ్చిపోయారు. ఆ పరిస్థితులలో తగిన న్యాయం చేయమంటూ షేక్ గులాబ్ చంపారన్ కలక్టరుకు మహజరు సమర్పించారు. కలక్టర్ తక్షణమే తగు విచారణకు ఆదేశించాడు. ఆ ఆదేశాల మేరకు నియమితుడైన ఆంగ్లేయ విచారణాధికారి సక్రమంగా విచారణ జరపనందున ఉన్నతాధికారులకు షేక్ గులాబ్ మళ్ళీ ఫిర్యాదు దరఖాస్తు పంపారు. ఆ సాహసాన్ని సహించని ఆంగ్ల అధికారులు షేక్ గులాబ్ చర్యలను, రైతాంగ ఉద్యమాన్ని నిలువరించాలని

నిర్ణయించుకున్నారు. ఈ క్రమంలో ఆంగ్లేయ యజమానులలో సాటి ప్రాంతానికి చెందిన ఆంగ్లేయ యజమాని యఫ్.సి కొఫిన్ (F.C Coffin) షేక్ గులాబ్, ఆయన అనుచరుల మీద అక్రమ క్రిమినల్ కేసులను పెట్టించాడు. ఆ కారణంగా 1907 సెప్టంబర్ 12న షేక్ గులాబ్‌ను ఆయన అనుచరులను అరెస్టు చేశారు. ఆ కేసులో షేక్ గులాబ్, 162 మంది రైతులకు శిక్షలు విధించి జైళ్ళకు తరలించారు. ఆ తరువాత ఉన్నత న్యాయస్థానం ఆ శిక్షలను రద్దు చేసింది.

పట్టువదలని విక్రమార్కుడిగా ముందుకు సాగుతున్న షేక్ గులాబ్‌ను చూసి, ఆయన త్యాగాల పరంపరను గమనించిన చుట్టుపక్కల రైతాంగం కూడా గులాబ్ నాయకత్వం క్రింద పెద్ద ఎత్తున ఏకమయ్యారు. ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని, ఆజ్ఞలను ధిక్కరించ సాగారు. ప్రలోభాలకు లొంగని షేక్ గులాబ్‌ను ఆర్థికంగా నష్టపర్చేందుకు ఆంగ్లేయ యజమాని F.C Coffin పలు పన్నాగాలకు పాల్పడ్డాడు. ఆ కారణంగా షేక్ గులాబ్ కుటుంబం ఆర్థిక లోటుతోబాటుగా భౌతిక దాడులకు కూడా గురయ్యింది. భూమిని, ఆస్తులను కూడా పోగొట్టుకుంది.

ఈ పరిస్థితులను పరిగణనలోకి తీసుకున్న షేక్ గులాబ్ ఆయన సహచరులు బేతియా (Bettiah) కు చెందిన రాధేమల్ ఇంట సమాలోచన జరిపి రైతాంగ ఉద్యమాన్ని ఉధృతం చేయాలని నిర్ణయించారు. 1908లో దసరా పండుగ సందర్భంగా జరిగిన సభలో భారీ సంఖ్యలో హాజరైన రైతాంగాన్ని ఉద్దేశించి షేక్ గులాబ్, శీతల్ రాయ్, రాజ్‌కుమార్ శుక్లా ప్రసంగిస్తూ నీలి పంటను బహిష్కరించాల్సిందిగా పిలుపునిచ్చారు. ఆ పిలుపు మేరకు రైతులు నీలి పంటను పండించడం మానుకున్నారు. ఆ చర్యలకు ప్రతిగా వ్యవహరిస్తూ దౌష్ట్యానికి పాల్పడిన పరసు (Parasu) కర్మాగారం ఆంగ్లేయ మేనేజర్, అతని బంటు మీద రైతులు దాడి చేశారు. ఆ చర్యతో ధైర్యం కూడగట్టుకున్న ఇతర ప్రాంతాల రైతులు ఆంగ్లేయుల దాడులను తిప్పికొట్టడం ఆరంభించారు.

ఈ పరిణామాలతో ఖంగుతిన్న ఆంగ్లేయ యజమానులు, అధికారులు రైతు నాయకుల మీద చర్యలకు ఉపక్రమించారు. రైతు నాయకుల, రైతాంగ ఉద్యమంలో చురుగ్గా వ్యవహరిస్తున్న రైతుల అక్రమ నిర్భంధాలు ఆరంభమయ్యాయి. రైతాంగ చర్యల వలన గ్రామాలలో అశాంతి ప్రబలిందని, శాంతి భద్రతలకు భంగం వాటిల్లందంటూ పోలీసు-సైనిక చౌకీలు ఏర్పాటు చేశారు. ఆ చౌకీల ఏర్పాటుకు అయ్యే ఖర్చులను ఆయా గ్రామాలకు చెందిన రైతాంగం నుండి బలవంతంగా వసూలు చేయడం ఆరంభించారు. అయినప్పటికి రైతాంగ అందోళనలు ఆగలేదు. ఆంగ్ల ప్రభుత్వం గ్రామాలకు పంపిన పోలీసు, సైనిక దళాలు రైతుల మీద హింసాకాండ, దోపిడికి పాల్పడసాగాయి.

ఆంగ్లేయుల చర్యలేవీ కూడా షేక్ గులాబ్ విప్లవకర కార్యకలాపాలకు అడ్డుకట్టవేయలేక పోయాయి. చివరకు షేక్ గులాబ్ అరెస్టుకు వారెంట్ జారీ అయ్యింది. షేక్ గులాబ్ ఆంగ్ల ప్రభుత్వ పోలీసుల, గూఢాచారుల కళ్ళుగప్పి తన కార్యక్రమాలను నిర్వహించసాగారు. ప్రియతమ రైతు నాయకుడు షేక్ గులాబ్‌ను గ్రామీణులు, రైతు కుటుంబాలు కడుపులోపెట్టుకుని కాపాడసాగాయి. షేక్ గులాబ్‌ను నిర్బంధించ లేకపోయిన ఆంగ్ల ప్రభుత్వం ఆయనను పట్టిచ్చినవారికి ఐదు వందల రూపాయల నజరానా, జప్తు చేయబడిన భూమి, కానిస్టేబుల్ ఉద్యోగం బహుమతిగా ప్రకటించింది.

ఆయన అచూకి తెలుపమంటూ ప్రజల మీద రైతుల మీద ఒత్తిడి ఆంగ్ల సైనిక, పోలీసు దళాల హింసాకాండ సాగింది. ఆ ప్రతికూల పరిస్థితులలో షేక్ గులాబ్ ఎండ్ల బండిలో రహస్యంగా బేతియా కచ్చేరి చేరుకుని ఆధికారి ఎదుట తన్నుతాను సమర్పించుకున్నారు.

షేక్ గులాబ్ సహచరుల మీద పలు ఆరోపణలతో నేరాలను నమోదు చేసి పలువురిని పోలీసులు నిర్బంధించారు. పెద్ద సంఖ్యలో రైతుల అరెస్టులు జరిగాయి. అరెస్టయిన రైతుల సంఖ్య ఎక్కువగా ఉన్నందున ఆంగ్ల ప్రభుత్వం విచారణకు ప్రత్యేక ఏర్పాట్లు చేసింది. చివరకు రైతులు, రైతు నాయకులు సుమారు రెండు వందల మంది శిక్షలకు గురయ్యారు. షేక్ గులాబ్‌కు న్యాయస్థానం రెండు సంవత్సరాల జైలు, వెయ్యి రూపాయల జరిమాన విధించింది.

ఈ పరిణామాల నేపథ్యంలో చంపారన్‌లోని బేతియా, సాఠీ తదితర ప్రాంతాల రైతాంగ సమస్యల మీద విచారణకు డబ్లూ.ఆర్. గౌర్లే (W.R.Gourlay) కమిటీని ఆంగ్ల ప్రభుత్వం నియమించింది. 1909 ఏప్రిల్ 7న గౌర్లే తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించాడు. ఆ నివేదిక సమర్పించిన తరువాత శిక్షలు అనుభవిస్తున్న రైతులను కొన్ని షరతుల మీద ప్రభుత్వం విడుదల చేసింది. రైతాంగ నాయకుడు షేక్ గులాబ్ మాత్రం జైలులో పూర్తికాలం శిక్షను అనుభవించాక విడుదలయ్యారు. జైలులో ఆయన పట్ల పోలీసులు క్రూరంగా వ్యవహరించడంతో ఆనారోగ్యం పాలయ్యారు. షేక్ గులాబ్ కంటిచూపు మందగించింది.

జైలు గోడల నుండి విముక్తి పొందిన షేక్ గులాబ్ ఆరోగ్యం అనుమతించిన మేరకు రైతాంగ ఉద్యమాన్ని ఆరంభించారు. ఆ క్రమంలో మహాత్మాగాంధిని చంపారన్ రప్పించాలని షేక్ గులాబ్, రాజ్‌కుమార్ శుక్లా, పీర్ మూనీస్ ముహమ్మద్ తదితరులు ఆలోచనలు సాగించారు. ఆ ఆలోచనల ప్రకారం 1917లో మహాత్మాగాంధిని చంపారన్ రప్పించడంలో షేక్ గులాబ్ బహుముఖ పాత్రవహించారు. చంపారన్ రావడానికి అంగీకరించిన గాంధీజీ తన ప్రయాణం విశేషాలు వెల్లడించారు. ఆ సమాచారం మేరకు మహాత్ముడి చంపారన్ రాక గురించి షేక్ గులాబ్ ఆయన సహచరులు సాగించిన ప్రచారం వలన 1917 ఏప్రిల్ 15న మహాత్మాగాంధీ మోతిహార్ చేరుకోగానే అనూహ్య సంఖ్యలో రైతులు రైల్వే స్టేషన్ చేరుకుని ఘన స్వాగతం పలికారు.

షేక్ గులాబ్ ఆయన సహచరులు నీలితోటల, కర్మాగారాల యజమానుల దుశ్చర్యలకు వ్యతిరేకంగా రైతాంగాన్ని ఏకం చేసి ఉద్యమించి రైతులలో తెచ్చిన చైతన్యం, నిర్భీతి ఫలితంగా మహాత్మాగాంధి జరిపిన విచారణలో రైతులు పెద్ద సంఖ్యలో పాల్గొని మహజర్లు సమర్పించారు. మహాత్ముడు చంపారన్‌లో ఉన్నంత కాలం షేక్ గులాబ్ కూడా ఆయన వెంట ఉంటూ, రైతాంగ సమస్యలకు చెందిన కార్యక్రమాలు మాత్రమే కాకుండా హిందూ–ముస్లింల ఐక్యతకు సంబంధించిన ఇతర సామాజిక కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్నారు. చంపారన్ రైతుల సమస్యల పరిష్కారానికి, ఆంగ్లేయుల దౌర్జన్యాలను బహిర్గతం చేస్తూ మహాత్మాగాంధీ నేతృత్వంలో సాగిన చంపారన్ సత్యాగ్రహం నీలి తోటల, కర్మాగారాల ఆంగ్లేయ యజమానుల దుశ్చర్యలకు చట్టబద్ధంగా చరమగీతం పాడిన తరువాత 1920లో రైతాంగ పోరాట నాయకుడు షేక్ గులాబ్ కన్నుమూశారు.

# పీర్ ముహమ్మద్ మూనీస్

1905లో చంపారన్ రైతాంగ పోరాటాన్ని షేక్ గులాబ్ ఆరంభించాక ఆ ఉద్యమాన్ని కొత్తపుంతలు తొక్కించడంలో సహాయపడిన పాత్రికేయ యోధులు పీర్ ముహమ్మద్ మునిస్ (1882 –1949) బెతీయా గ్రామంలో 1882లో జన్మించారు. ఆయన తండ్రి పేరు ఫతింగన్ మియాన్ (Fatingan Miyan). ఆంగ్లేయ ప్రభుత్వం పట్ల, ఆంగ్లేయ నీలి తోటల, కర్మాగారాల యజమానుల దోపిడి, ఆధిపత్యాన్ని పీర్ ముహమ్మద్ మూనిస్ తొలుత నుండి వ్యతిరేకించారు. ఆ వ్యతిరేక భావాల వ్యక్తీకరణకు ఆయన కలాన్ని ఆయుధంగా ఎంచుకున్నారు. గురు ట్రైనింగ్ స్కూలు (Guru Training School) లో ఉపాధ్యాయునిగా పనిచేస్తూ హిందీ వార్తపత్రికలకు లేఖలు, వ్యాసాలు రాయడం అరంభించారు. ఆ క్రమంలో సాయంచేసే వ్యక్తి, సహచరుడు, కామ్రెడ్ అను భావాన్ని స్ఫురింపచేయ 'మూనీస్' అను కలం నామాన్ని తన పేరుకు జోడించుకుని పీర్ మహ్మద్ అన్సారి కాస్తా 'పీర్ ముహమ్మద్ మూనీస్' గా సుప్రసిద్ధులయ్యారు.

ప్రముఖ విప్లవకారుడు, ప్రఖ్యాత జర్నలిస్టు గణేష్ శంకర్ విద్యార్థి (1890–1931) కాన్పూరు కేంద్రంగా 1913లో ప్రారంభించిన 'ప్రతాప్' వారపత్రికలో పీర్ ముహమ్మద్ మూనీస్ చంపారన్ ప్రాంతం పాత్రికేయుడిగా బాధ్యతలు నిర్వహించారు. ఈ పత్రిక ఆ తరువాతి కాలంలో దినపత్రికగా మారింది. చంపారన్ ప్రజల ప్రధానంగా రైతుల సమస్యల మీద, ఆంగ్లేయాధికారులు, నీలి తోటల, కర్మాగారాల యజమానులు సాగిస్తున్న దోపిడి, ఆకృత్యాలను ఎండగడ్తూ ఎప్పటికప్పుడు వ్యాసాలను, వార్తలను ప్రచురించారు. ప్రతాప్ పత్రికలో మాత్రమే కాకుండా పీర్ మూనీస్ ఇతర హిందీ పత్రికలలో కూడా చంపారన్ రైతుల సమస్యలు, ప్రజల ఇక్కట్లను ఏకరువు పెడుతూ ప్రధానంగా రైతుల సమస్యలను ప్రపంచ దృష్టికి తెచ్చారు.

ఆ కారణంగా పీర్ మూనీస్ ఇటు నీలి తోటల, కర్మాగారాల యజమానుల అటు ఆంగ్లేయాధికారుల ఆగ్రహానికి పలుమార్లు గురయ్యారు. ఆంగ్ల ప్రభుత్వ రికార్డులు Badmash Pathrakar, Dangerous, Notorious, Hoodlum Journalist, Bitter Man అంటూ ఆయన పట్ల ఉన్న ద్వేషాన్ని వెల్లడించాయి. మూనీస్ సృజనను Doubtful Litarature గా ప్రకటించాయి. ఆంగ్లేయులు, ఆంగ్ల ప్రభుత్వ రికార్డులు ఏమన్నా తాను మాత్రం నిరంతరం విప్లవకారుడు గణేశ్ శంకర్ విద్యార్థి మార్గదర్శకత్వంలో రైతాంగ ఉద్యమ కార్యకలాపాలను రూపకల్పన చేసుకుంటూ నిర్భయంగా చంపారన్ రైతులకు అండగా నిలిచారు. ఆయన ఆంగ్లేయుల దోపిడిని, ఆంగ్ల ప్రభుత్వ నిర్వాకాన్ని, చంపారన్ రైతాంగం సమస్యలను వార్తలు, వ్యాసాలతో ప్రాంతీయ స్థాయి నుండి జాతీయ స్థాయి ఎరుకలోకి తెచ్చారు.

1905లో షేక్ గులాబ్ ప్రారంభించిన రైతాంగ ప్రతిఘటనోద్యమానికి తొలుత నుండి పీర్ మూనీస్ మద్దతు ప్రకటించడం మాత్రమే కాకుండా ఆయన పోరాట కార్యక్రమాలకు మార్గదర్శకం వహించారు. ఆయన గృహం రైతునాయకుల సమాలోచనలకు రహస్య కేంద్రం


పీర్ ముహమ్మద్ మూనీస్ (1882–1949)

అయ్యింది. చంపారన్ రైతాంగ పోరాటాన్ని వివరిస్తూ 'నీల్ విభ్రాత్ ఆందోళన్' (Neel Vibhraat Andolan) పేరుతో నీలి ప్రతిఘటనోద్యమం (Indigo Resistance Movemnet) శీర్షికన 'హిందీ కేసరి' పత్రికలో ఆయన రాసిన వ్యాసం ఆంగ్లేయాధికారులను కలవరం పుట్టించింది. రైతుల ఈ ప్రతిఘటనోద్యమం విశేషాలను ఎప్పటికప్పుడు పూసగుచ్చినట్టుగా వివరిస్తూ ప్రతాప్ పత్రిక, ఇతర పత్రికలలో పీర్ ముహమ్మద్ రాసిన వ్యాసాలు, అందించిన ఉద్యమ వార్తలు ఇటు అఖిల భారత జాతీయ కాంగ్రెస్ నాయకుల దృష్టిలోకి మాత్రమే కాకుండా ఆంగ్ల ప్రభుత్వం దృష్టికి కూడా వచ్చాయి. నీలి ప్రతిఘటనోద్యమ నేత షేక్ గులాబ్ ఆయన అనుచరుల మీద ఆంగ్లప్రభుత్వం విరుచుకుపడిన తరువాత ఉద్యమ ఉధృతి తగ్గిపోయినా చంపారన్ రైతుల పక్షాన పోరాటాన్ని మూనీస్ విరమించలేదు. 'ప్రతాప్' పత్రికలో Prardhna (06-09-1915), Champaran Mein Atyachar (17-02-1916), Champaran Mein Andhera (13-03-1916), Bihar Sarkar Ka Ek Anuchit Karya (03-04-1916) వ్యాసాల ద్వారా రైతుల కష్టాలను ఆయన వెల్లడించారు.

చివరకు షేక్ గులాబ్ సూచన మేరకు మహాత్మాగాంధీ దృష్టికి చంపారన్ రైతులు దుస్థితిని తీసుకు వెళ్ళాలని పీర్ మూనీస్,రాజ్‌కుమార్ శుక్లా యోచన చేశారు. ఆ నిర్ణయం మేరకు 'మీరు, మీ అనుచర సత్యాగ్రాహి సోదర, సోదరీమణుల మీద ఆఫ్రికాలో సాగిన అత్యాచారాల కంటె మా దుఃఖిత గాధలు ఏమాత్రం తక్కువ కాదు' అంటూ తమ ఇక్కట్లును వివరిస్తూ 1917 ఫిబ్రవరి నుండి మార్చి వరకు పీర్ మూనీస్ గాంధీజీకి మూడు ఉత్తరాలు రాశారు. 1916లో లక్నో నగరంలో జరిగిన అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు రాజకుమార్ శుక్లా, పీర్ మూనీస్ హాజరయ్యి గాంధీజీని కలిసారు. 'రాజ్ కుమార్ శుక్లా చదువురాని రైతు' (ఆత్మకథ, మహాత్మాగాంధి, పుట. 354) కావటం వలన పీర్ మూనీస్ రాసిన వినతి పత్రాన్ని శుక్లా గాంధీజీకి అందజేశారు. అయన రచనలకు అంతగా ప్రభావితులైన గాంధీజీ మోతిహార్ చేరుకుని ఏప్రిల్ 23న స్వయంగా పీర్ మూనీస్ ఇంటికి వెళ్ళి ఆయన తల్లిని పరామర్శించి వచ్చారు. ఈ విషయాన్ని ప్రతాప్ పత్రిక (03–04–1917) సంచికలో ప్రచురించింది.

ఆ ప్రయత్నాల ఫలితంగా మహాత్ముడు చంపారన్ రావడానికి అంగీకరించారు. గాంధీజీ చంపారన్ వస్తున్నారన్న విషయాన్ని కూడా తన సహచరుల ద్వారా మూనీస్ ప్రచారంలో పెట్టారు. ప్రతాప్ పత్రికలో 'ప్రార్ధన' శీర్షికన మహాత్ముడు చంపారన్ వస్తున్న విషయాన్ని ప్రచారంలోకి తెచ్చారు. ఈ శీర్షికన ప్రచురించిన కరపత్రాన్ని పంపిణీ చేస్తూ ఒక సాధువు పట్టుబడగా ఆంగ్ల

అధికారులు కలవరపడ్డారు. మహాత్ముడు చంపారన్ వచ్చినప్పటి నుండి చంపారన్ విడిచి వెళ్ళేవరకు పీర్ ముహమ్మద్ మూనీస్ ఆయన వెన్నంటి ఉన్నారు. చంపారన్‌లో మహాత్ముడికి పూర్తి స్థాయిలో అండదండలు అందిస్తున్న వ్యక్తుల జాబితాను ఆంగ్లేయ పోలీసు అధికారులు తయారుచేయగా అందులో పీర్ ముహమ్మద్ మూనీస్ ప్రముఖుడిగా ఉన్నారు.

చంపారన్ సత్యాగ్రహ రైతు ఉద్యమాన్ని మహాత్ముడు సాగిస్తున్నంత కాలం పీర్ మూనీస్ ఆంగ్లేయుల బెదిరింపులకు ఏమాత్రం లొంగకుండా ఉద్యమ విశేషాలను ప్రతాప్ పత్రిక ద్వారా ప్రపంచానికి తెలియబర్చారు. ఆయన, Champaran Ki Durdasha (16-4-1917), Champaran mein Karmveer Gandhiji Ka Agaman (30-04-1917), Champaran mein Mahatma Gandhi (7, 8, 28 May 1917), Champaran mein Teenkathiya Pratha (21 May; 4, 11, 18 June 1917) అను వ్యాసాలు రాశారు. Champaran Ka Uddar అను పుస్తకాన్ని కూడా 'ప్రతాప్' పత్రిక ద్వారా వెలువరింపజేశారు. ఆ కారణంగా ఆంగ్లేయుల ఆగ్రహానికి గురయ్యారు. ఆంగ్లేయ యజమానులు ఆయన ఉద్యోగాన్ని ఊడబెరికించారు. ఆయన ఆస్తిపాస్తులను జప్తు చేయించారు. చివరకు పలు నేరారోపణలతో అక్రమ క్రిమినల్ కేసును నమోదు చేసినందున ఆయనకు ఆరు మాసాల జైలు శిక్ష పడింది. అప్పీల్ చేయగా ఆ శిక్ష మూడు మాసాలకు తగ్గింది. ఆయన జైలులో అనుభవించిన దుస్థితిని 1918 సెప్టెంబర్ 30 నాటి ప్రతాప్ పత్రిక Sansani Phailaane Wala Mukaddama శీర్షికతో సంపాదకీయం ప్రచురించింది.

భారత స్వాతంత్ర్యోద్యమాన్ని 'సత్యాగ్రహోద్యమం' దిశగా నడిపించిన చంపారన్ సత్యాగ్రహోద్యమం స్వరూప–స్వభావాలను నిర్ధేశించిన మహాత్మాగాంధీ చంపారన్ రాక వెనుక ఉన్న వ్యక్తుల గురించి బ్రిటిష్ ప్రభుత్వం పోలీసు రికార్డులు చేసిన ప్రస్తావనలో 'Pir Muhammad is actually a dangerous and hoodlum journalist who, through his questionable literature, brought into light the sufferings of a backward place like Champaran in Bihar and influenced Mr Gandhi to visit Champaran అని పేర్కొనబడింది. చంపారన్ నుండి గాంధీజీ నిష్క్రమణ తరువాత కూడా విరామమెరుగని యోధునిలా బాధితుల పక్షాన పోరాటాన్ని సాగించారు. ప్రతాప్ పత్రికలో Champaran mein Phir Atyachar (04-08-1918), Champaran mein Phir Nadirshahi (30-08-1920) లాంటి పలు వ్యాసాలను ప్రచురింపజేస్తూ ఆంగ్లేయ యజమానులకు, అధికారులకు కంటి మీద కునుకు లేకుండా చేశారు. ప్రతాప్, బాలక్, జనశక్తి లాంటి పత్రికలలో దుఃఖీ ఆత్మ, ఏక్ దుఃఖీ ఆత్మ, దుఃఖీ హృదయ్, సానుభూతి హృదయ్ లాంటి పేర్లతో వ్యాసాలు రాసి రైతుల దుస్థితిని భారత జాతీయ కాంగ్రెస్ నేతల దృష్టికి తెచ్చారు.

బాధిత రైతు జన పక్షం వహించిన పీర్ మూనీస్ రైతులను సంఘటితం చేస్తూ 1918లో స్వయంగా 'రైతుసభ' (Raiyati Sabha) ఏర్పాటు చేశారు. ఆ 'రైతుసభ' ఆధ్వర్యంలో చంపారన్ చెరుకు రైతుల పక్షాన రైతు సమస్యల పరిష్కారం కోసం పోరాడారు. నీలి పంట స్థానాన్ని ఆక్రమించిన చెరకు పంట విషయంలో కూడా ఆంగ్లేయాధికారుల పెత్తనాన్ని సహించని మూనీస్

చెరుకు రైతుల ఉద్యమాలకు మార్గదర్శకం చేశారు. చంపారన్ చరిత్రకు సంబంధించి, భారత స్వాతంత్ర్యోద్యమం గురించి, హిందూ-ముస్లిం ఏకత్వం ప్రభోదిస్తూ, హిందీ-ఉర్దూ భాషల అభివృద్ధిని ఆశిస్తూ ఆయన రాసిపెట్టుకున్న పలు రచనలు ప్రచురణకు నోచుకోలేదు. ఆయన చంపారన్ చర్రితను కూడా అక్షరబద్ధం చేశారు. ఆయన అముద్రిత రచనలు, లేఖలు, ఇతర ముఖ్యమైన పత్రాలు 1934లో సంభవించిన భూకంపంలో ధ్వంసమయ్యాయి.

పీర్ మూనీస్ రైతుపక్షం మాత్రమే కాకుండా ప్రజల హక్కులు, అధికారాల రక్షణకు కూడా శ్రమించారు. హరిజన పారిశుధ్య కార్మికులను ఏకం చేస్తూ వారి న్యాయమైన హక్కుల కోసం ఆయన పోరాడారు. 'బీహార్ హిందీ సాహిత్య సమ్మేళన్' వ్యవస్థాపక సభ్యులుగా 'హిందూస్థానీ' అభివృద్ధికి, ప్రాచుర్యానికి కృషిచేశారు. మాతృభూమి విముక్తికి హిందూ-ముస్లింల ఐక్యత అవసరమని భావించిన ఆయన ఆ దిశగా ఎంతో కృషి చేశారు. భారతదేశంలోని సాంఘిక జన సముదాయాలలో భిన్నత్వంలో ఏకత్వం-ఏకత్వంలో భిన్నత్వం తప్పసరి ఆయన ఉద్బోధించారు.

ఆంగ్లేయుల పొడ ఏమాత్రం గిట్టని పీర్ మూనీస్ స్వాతంత్ర్యోద్యమంలో చురుగ్గా పనిచేశారు. 1921లో ఏర్పడిన అఖిల భారత జాతీయ కాంగ్రెస్ చంపారన్ జిల్లాశాఖ స్థాపనలో ప్రధాన పాత్రపోషించారు. చంపారన్ జిల్లా పరిషత్‌లో ప్రజాప్రతినిధిగా ఎంపికయ్యారు. బేతియా లోకల్ బోర్డు అధ్యక్షులుగా బాధ్యతలు నిర్వహిస్తూ 1937లో గాంధీజీ పిలుపు మేరకు వ్యక్తిగత సత్యాగ్రహంలో పాల్గొనేందుకు అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్న ఆయనను ఆంగ్ల ప్రభుత్వం మూడు మాసాలపాటు పాట్నా క్యాంపు కారాగారంలో నిర్బధించింది. ఆంగ్ల ప్రభుత్వం, నీలి తోటల, కర్మాగారాల ఆంగ్లేయ యజమానులు, ఆంగ్లేయాధికారులు ఎన్ని ఎత్తులు వేసినా, ఎంత కాఠిన్యం చూపినా ఏమాత్రం చలించకుండా ఇటు మాతృభూమి విముక్తి పోరాటంలో అటు ప్రజల ప్రధానంగా బాధిత రైతు జనసముదాయాల సంక్షేమం కోసం ఉద్యమించిన కలం యోధులు పీర్ ముహమ్మద్ మూనీస్ 1949 డిసెంబర్ 24 కన్నుమూశారు.

# చంపారన్‌లో 'కర్మవీరుడు'

చంపారన్ ప్రజల ద్వారా 'కర్మవీరుడు'గా ప్రకటించబడిన మహాత్మాగాంధీ తొలుత పాట్నా చేరుకున్నారు. ఆయనను రాజ్‌కుమార్ శుక్లా పాట్నాలోని న్యాయవాది బాబూ రాజేంద్ర ప్రసాద్ ఇంటికి తీసుకెళ్ళారు. ఆ సమయంలో రాజేంద్ర ప్రసాద్ పాట్నాలో లేరు. ఆయన ఇంటి పనివాళ్ళు కులపరమైన ఆంక్షల వలన గాంధీజీని వరండాలోకి తప్ప గృహంలోనికి రానివ్వలేదు. ఆ గృహంలోని మరుగు దొడ్డిని ఉపయోగించడానికి కూడా అనుమతించ లేదు. బయట ఉన్న బావిలో నీరు తోడుతున్నా పనివాళ్ళు అభ్యంతరకరంగా వ్యవహరించారు. ఈ విషయాలను మహాత్ముడు 'ఆత్మకథలో పేర్కొనడమే కాకుండా కుమారుడు మగన్‌లాల్ గాంధీకి లేఖ రాస్తూ అందులో 'మమ్మల్ని బిక్షగాళ్ళుగా పరిగణించారు' అని పేర్కొన్నారు. ఆ సమయంలో లండన్ సహవాసి మౌలానా మజ్‌హరుల్ హఖ్ (1866-1930) పాట్నావాసి అని గుర్తుకు వచ్చి తాము పడుతున్న ఇక్కట్లను వివరిస్తూ

ఆయనకు కబురు పంపారు. ఆ సమాచారం తెలుకున్న మౌలానా హఖ్ ఆఘమేఘాల మీద మహాత్ముడి వద్దకు వచ్చి ఆయన ముజఫర్‌పూర్ వెళ్ళడానికి తగిన ఏర్పాట్లు చేసారు

మహాత్మాగాంధీ పాట్నా నుండి రాజ్‌కుమార్ శుక్లాతో కలసి ముజఫర్‌పూర్ వెళ్ళి అటునుండి చంపారన్ చేరుకున్నారు.'ఆత్మకథ'లో గాంధీజీ 'చంపారన్ మచ్చ' (The Stain of Indigo) అను శీర్షికతోపాటు వివిధ శీర్షికల క్రింద చంపారన్ సత్యాగ్రహోద్యమానికి సంబంధించిన వివరాలను గాంధీజీ పేర్కొన్నారు. ఆయనకు మోతిహార్‌లో రైతులు పెద్ద సంఖ్యలో స్వాగతం పలికారు. ఆయన మోతిహార్ చేరుకోగానే తన విచారణ కార్యక్రమాన్ని ఆరంభించారు. ఆయన రాకకు ముందే షేక్ గులాబ్ నాయకత్వంలో చంపారన్ రైతాంగం ఏకమై ఉన్నందున, పీర్ ముహమ్మద్ మూనీస్ లాంటి పాత్రికేయులు మహాత్ముడి రాక గురించి ముందుగా ప్రచారం సాగించి ఉండటం వలన రైతులు ఏమాత్రం జంకుబొంకు లేకుండా తమ కష్టాలను, నష్టాలను, ఆంగ్లేయ యజమానుల క్రూరత్వాన్ని వివరిస్తూ గుంపులు గుంపులుగా మహాత్ముడి వద్దకు రాసాగారు.

ఈ పరిస్థితిని వివరిస్తూ 'మా పని బాగా పెరిగింది. రైతులు గుంపులు గుంపులుగా వచ్చి తమ గాథలు వ్రాయించసాగారు, వ్రాసుకునేవారి దగ్గర జనం పెరిగిపోసాగారు. ఇల్లంతా జనంతో నిండిపోసాగింది' అని గాంధీజీ తన ఆత్మకథలో పేర్కొన్నారు. మహాత్ముడి వెంట బాబూ రాజేంద్ర ప్రసాద్, మౌలానా మజ్‌హరుల్ హఖ్, బ్రజ కిషోర్ ప్రసాద్ తదితర ప్రముఖ న్యాయవాదులు నిలబడటంతో చంపారన్ రైతుల్లో ఉత్సాహం ఉరకలెత్తింది. ఆంగ్లేయ యజమానులను ఖాతరు చేయకుండా రైతులు ఆంగ్లేయుల అకృత్యాలను ఎకరువు పెట్టసాగారు. ఆ ప్రతికూల పరిస్థితిని గమనించిన ఆంగ్ల ప్రభుత్వం, అధికారులు, ఆంగ్లేయ యజమానులు న్యాయబద్ధంగా గాంధీజీని నియంత్రించాలని చూసి విఫలయయ్యారు. ఆ నియంత్రణ చర్యల సమయంలో ఒకవేళ మహాత్ముడు అరెస్టయితే ఆయన స్థానంలో మౌలానా మజ్‌హరుల్ హఖ్, బాబూ రాజేంద్ర ప్రసాద్ బాధ్యతలు చేపట్టాలని నిర్ణయం జరిగింది. మహాత్ముడి వెంట నడుస్తున్న అసంఖ్యాక రైతుజనాన్ని, న్యాయవాదుల బృందాన్ని చూసిన ఆంగ్ల ప్రభుత్వం చేష్టలుడికి చూస్తుండి పోయింది.

ఆ పరిస్థితి ఆంగ్లేయ యజమానుల కోపకారణమయ్యింది. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, 'చంపారన్‌లో గల తెల్ల ఖామందులు బాగా కోపంగా ఉన్నారని నాకు తెలుసు. అధికారులు కూడా లోపల సంతోషంగా ఉండరని తెలుసు. వాళ్లకు కోపం వస్తే నన్నేమీ చేయలేరు కాని పాపం అక్కడి నిరుపేదలగు రైతుల్ని యమబాధలు పెడతారని అందువల్ల నేను చేయదలచుకున్న విచారణ సరిగ్గా జరగదని గ్రహించాను. తెల్లదొరలు అప్పుడే విషప్రచారం ప్రారంభించారు. వాళ్ళు నాకు, నా అనుచరులకు వ్యతిరేకంగా అబద్ధపు ప్రకటనలు పత్రికల్లో ప్రకటించడం ప్రారంభించారు' (ఆత్మకథ : మహాత్మాగాంధీ, పుట.362) అని మహాత్ముడు ఆత్మకథలో పేర్కొన్నారు. నీలి కర్మాగారం మేనేజర్ బెట్టియరాజ్ అనునతడు 'గాంధీజీ నిజాయితీ పరుడు కావచ్చుగాని, దక్షణాఫ్రికాలో లభించిన విజయాలతో ఆయన తనను తాను ఎక్కువగా ఊహించుకుంటున్నాడు. గాంధీజీని తేలిగ్గా అమరవీరుడిని చేయవచ్చుగానీ, అణిచి వేయడం సాధ్యం కాదని' అన్నాడంటే

ఆంగ్లేయుల ఆగ్రహం ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు. ఆ ప్రేరణతో ఆంగ్లేయ యజమాని ఇర్విన్ రంగంలోకి దిగాడు. మహాత్ముడి మీద ఇర్విన్ హత్యాయత్నం సాగించాడు. ఆంగ్లేయ యజమాని Irwin / Erwin తో గాంధీజీ జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలలో ఘాటైన విమర్శలు, ఆరోపణలు, ప్రత్యారోపణలు సాగి ఉన్నాయి. చంపారన్ బాలబాలికలలో విద్యాభివృద్ధి కోసం గాంధీజీ పాఠశాలలను ఆరంభించారు. రాత్రి వెదురు, గడ్డితో నిర్మితమై పాఠశాలను తగుల బెట్టించారు. ఈ ప్రతీకార చర్యల నేపథ్యం లో మహాత్ముడిని అంతం చేయాలని ఇర్విన్ పన్నిన విషాహారం కుట్రను బతఖ్ మియా అన్సారి వమ్ము చేయడంతో 'జాతిపిత' బ్రతికి బట్టకట్టగలిగారు. చంపారన్ సత్యగ్రహోద్యమంలో విజయం సాధించగలిగారు.

మహాత్మాగాంధీ నేతృత్వంలో సాగించిన చంపారన్ సత్యాగ్రహోద్యమం చివరకు విజయం సాధించింది. 1917 జూన్ ఐదున రాంచీలో బీహార్-ఒరిస్సా గవర్నర్ సర్ ఎడ్వర్డ్ గెయిట్ (Sir Edward Gait) గాంధీజీతో జరిపిన చర్చల పర్యవసానంగా సర్ ఫ్రాంక్ స్లే (Sir Frank Sly) నేతృత్వంలో ఆంగ్ల ప్రభుత్వం విచారణ కమిటీ ఏర్పాటు చేసింది. ఆ కమిటీలోని సభ్యులలో మహాత్ముడు కూడా ఒకరయ్యారు. చంపారన్ రైతాంగం నుండి ఆయన సేకరించిన ఎనిమిది వేలకు పైగా సాక్ష్యాధారాలతో కూడిన ఫిర్యాదులను గాంధీజీ కమిటీకి సమర్పించారు. ఈ విచారణ కమిటీ, 'రైతులు చేసిన ఆరోపణలన్నీ నిజమేనని ప్రకటిస్తూ 1917 నవంబరు 29న నివేదికను సమర్పించింది. తెల్లదొరలు తీసుకున్న సొమ్ము నుండి కొంత భాగం రైతులకు చెల్లించాలని, తీన్‌కతియా రివాజును రద్దుచేయాలని సిఫారస్సు చేసింది.' (ఆత్మకథ : మహాత్మాగాంధీ, పుట. 369). ఆ సిఫారస్సులు వెల్లడయ్యాక మహాత్మాగాంధీ చంపారన్ సహచరులకు వీడ్కోలు పలికారు.

ఆ సిఫారస్సులను కూడా వమ్ము చేయాలని ఆంగ్లేయ యజమానులు, అధికారులు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. చివరకు Champaran Agrarian Act of 1918 వచ్చింది. ఆ చట్టం రాకతో '100 సంవత్సరాల నుండి అమలులో ఉన్న తీన్‌కతియా విధానం రద్దు అయ్యింది. తెల్లదొరల రాజ్యం కూడా అస్తమించింది' (ఆత్మకథ : మహాత్మాగాంధీ, పుట. 369). ఆనాడు బతఖ్ మియా అన్సారి తెగువ, సాహసం వలన మహాత్మాగాంధీ ఆంగ్లేయుల కుట్రల నుండి సురక్షితంగా బయటపడి మాతృభూమి విముక్తి కోసం సాగిన పోరాటంలో పాల్గొన్న స్వాతంత్ర్య సమర యోధులలో అగ్రగామిగా నిలిచారు.

◆ ◆ ◆

**అ**ది 1950.

బీహార్ రాష్ట్రం, తూర్పుచంపారన్ ప్రాంతంలోని మోతిహార్ జిల్లా కేంద్రంలోని మోతిహార్ రైల్వేస్టేషన్. భారత ప్రథమ రాష్ట్రపతి, బీహార్ బిడ్డడు డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ రాక సందర్భంగా ఏర్పాటు చేసిన సభాకార్యక్రమం జరుగుతుంది. డాక్టర్ రాజేంద్ర బాబు ప్రసంగిస్తున్నారు. ఆ సందర్భంగా సభలోని ఒక మూల నుండి కలకలం విన్పించింది. ఒక వృద్ధుడు తాను రాజేంద్ర బాబును కలవాలని అడ్డగిస్తున్న పోలీసులను అభ్యర్థిస్తున్నారు. ఆ వైపుగా భారత

రాష్ట్రపతి దృష్టి మళ్ళింది. ఆశ్చర్యం. ఆయన 1917లో మహాత్ముడిని విషాహారం నుండి తప్పించి, ఆయన ప్రాణాలను కాపాడిన బతఖ్ మియా అన్సారి...అవును ఆయన భతఖ్ మియా అన్సారే! డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ స్వయంగా బతఖ్ మియా అన్సారిని సభా వేదిక మీదకు స్వాగతించారు. ఆయనను ఆప్యాయంగా కౌగలించుకున్నారు. తన ప్రక్కన ఆసనం మీద బతఖ్ మియా అన్సారీని గౌరవంగా కూర్చోబెట్టుకున్నారు. ఈ అనూహ్య దృశ్యాన్ని చూస్తున్న సభికులు ఆశ్చర్యపోయారు. ఎవరాయనా? ఎవరాయనా? అను ప్రశ్న సభికుల మస్తిష్కాలలో గింగిర్లు తిరగసాగింది.

సభికుల ఉత్సుకతకు సమాధానంగా భారత ప్రధమ రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ 1917లో జరిగిన సంఘటనలను గుర్తుకు తెచ్చుకున్నారు. ఆ సంఘటనలో మహాత్మాగాంధీ మీద సాగిన హత్యాయత్నాన్ని వమ్ముచేయడానికి బతఖ్ మియా అన్సారి ప్రదర్శించిన ధైర్యం జ్ఞప్తికి వచ్చింది. ఈయన ఎవరని ఆశ్చర్యపోతున్నారా? అని ప్రజలనుద్దేశించి ప్రశ్నిస్తూ అలనాటి సంఘటనను పూసగుచ్చినట్టు వివరించారు. ఆంగ్లేయుడు ఇర్విన్ మహాత్ముడి ప్రాణాలు హరించాలని కుట్రపన్నగా, ఆ కుట్రను వమ్ముచేసి గాంధీజీని కాపాడిన మహనీయుడు ఈయనే అని సభాముఖంగా ప్రకటించారు. మహాత్మాగాంధీ మీద జరిగిన హత్యాయత్నం, ఆ హత్యాయత్నాన్ని వమ్ముచేసిన బతఖ్ మియా అన్సారి సాహస ఉదంతం అప్పుడు కానీ ప్రపంచానికి వెల్లడికాలేదు.

ఆనాడు ఆంగ్లేయ యజమాని ఇర్విన్ ఆజ్ఞను జవదాటినందుకు తను, తన కుటుంబం అనుభవించిన దారుణాలను బతఖ్ మియా అన్సారి రాష్ట్రపతి బాబూ రాజేంద్ర పస్రాద్‌కు వివరించారు. పిల్లా పాపలతో ఊరినుండి తరిమివేయబడిన బతఖ్ మియా అన్సారి ఆంగ్లేయుల దాష్టికానికి గురయిన పరిస్థితులను విన్న రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ చలించి పోయారు. బతఖ్ మియా అన్సారి, ఆయన ముగ్గురు కుమారులు షేర్ ముహమ్మద్ అన్సారి, ముహమ్మద్ రషీద్ అన్సారి, మహమ్మద్ జమాల్ అన్సారి కుటుంబాల బ్రతుకు దెరువు కోసం 36 బీగాల ( 50/ 25/ 24 ఎకరాలు / బీగాలు అంటూ వేర్వేరు ఉల్లేఖనాలు పేర్కొంటున్నాయి) వ్యవసాయ భూమిని సంక్రమింప జేయాల్సిందిగా రాష్ట్రపతి జిల్లా కలక్టర్‌ను స్వయంగా ఆదేశించారు.

1950 నాటి భారత రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ బతఖ్ మియా అన్సారిల అనూహ్య కలయిక గురించి విభిన్న కథనాలున్నాయి. 1950లో పదేండ్ల వయస్కులైన గిరిష్ మిశ్రా తన మిత్రులతో నాటి సభలో సభికులుగా పాల్గొన్నారు. ఆయన 2010లో Main Stream Weekly లో రాసిన వ్యాసంలో అలనాటి సంఘటనను సవివరంగా పేర్కొన్నారు. ఆనాడు రాష్ట్రపతి స్వయంగా ఇర్విన్ కుట్రను వమ్ముచేసి మహాత్మాగాంధీ ప్రాణాలను కాపాడిన బతఖ్ మియా అన్సారి సాహస ఉదంతాన్ని వెల్లడించారని తెలిపారు. బతఖ్ మియా అన్సారీ కుటుంబం దుస్థితిని తెలుసుకున్న రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ 50 ఎకరాల భూమిని ఆయన కుటుంబానికి సంక్రమింప చేయాలని జిల్లా అధికారికి ఆజ్ఞలు జారీచేసిన విషయాన్ని ప్రొఫెసర్ గిరిష్ మిశ్రా (ఆర్థిక శాస్త్రం అధ్యాపకులు, కిరోరిమల్ కళాశాల, ఢిల్లీ) స్పష్టంగా పేర్కొన్నారు.

ఈ విభిన్న కథనాలకు సంబంధించి, చంపారన్ రైతాంగ పోరాటం మీద విస్తృత పరిశోధన గావించిన డాక్టర్ మొహ్మద్ సజ్జాద్ (Dr Mohammad Sajjad, Professor, Alighar Muslim

University, Alighar), ఏజాజ్ అష్రఫ్ (Ajaz Ashraf, Journalist & Writer Delhi), అఫ్రోజ్ ఆలం (Afroz Alam Shahil, Writer & Editor : twocircle.net, Okhla, New Delhi), సందీప్ భాస్కర్ (Sandeep Bhaskar, Journalist), సంచారి పాల్ (Sanchari Pal, Journalist), అరవింద దాస్ (Aravind Das, Journalist, Media Vigil) తదితరులు బతఖ్ మియా అన్సారి సాహసాన్ని రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ సభాముఖంగా ప్రకటించిన విషయాన్ని తగిన సాక్ష్యాధారాలతో, మౌఖిక సమాచారం సహాయంతో ధృవీకరిస్తున్నారు.

ఈ కథనాలలో వివిధ వ్యక్తులు రాష్ట్రపతి మోతిహార్ ఎందుకు వచ్చారు? ఏ రైల్వేస్టేషన్ వద్ద సభికుల నుద్దేశించి ప్రసంగించారు. రాష్ట్రపతి ముందు బతఖ్ మియా అన్సారిని చూశారా? బతఖ్ మియా రాష్ట్రపతిని చూడ్డానికి ముందుకు దూసుకు వచ్చారా? బతఖ్ మియాకు రాష్ట్రపతి 24/25/50 ఎకరాలు లేక 36 బీగాల భూమిని సంక్రమింప జేయమని ఆదేశించారా? అను అంశాల మీద భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నా ఇర్విన్ విషాహారం కుట్ర నుండి మహాత్మాగాంధీని బతఖ్ మియా అన్సారీ కాపాడిన విషయంలో మాత్రం ఏకాభిప్రాయం వ్యక్తమౌతుంది.

రాష్ట్రపతి స్వయంగా సభాముఖంగా బతఖ్ మియా అన్సారి కుటుంబానికి వ్యవసాయ భూమి సంక్రమింపజేయాలని జిల్లా అధికారులకు ఆదేశాలు జారీచేయడంతో అంతవరకు తీవ్ర దుర్భిక్షాన్ని అనుభవించిన అన్సారి తన కుటుంబానికి మంచి రోజులు వచ్చాయని సంతోషించారు. ఆ సంతోషం ఎంతో కాలం నిలబడలేదు. ప్రధమ రాష్ట్రపతి ఆదేశాల అమలును ఆశిస్తూ ఏడు సంవత్సరాల పాటు ఎడతెరిపి లేకుండా ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ ప్రదక్షణలు చేసినా ఫలితం దక్కలేదు. చివరకు బతఖ్ మియా అన్సారి 04-12-1957 న కన్నుమూశారు.

1957 డిసెంబరు మూడున రాష్ట్రపతి అదనపు ప్రైవేటు కార్యదర్శి విద్యానాధ్ వర్మ నుండి రాష్ట్రపతి ఆదేశాలను ధృవీకరిస్తూ లేఖ కూడా వచ్చింది. ఆ తరువాత 1958 డిసెంబర్ మూడున బతఖ్ మియా అన్సారి పిల్లాపాపలను రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ ఢిల్లీకి ఆహ్వానించారు. అన్సారి త్యాగాన్ని స్మరిస్తూ రాష్ట్రపతి ఆయన కుటుంబీకులతో కలసి ఛాయా చిత్రాలను తీయించారు (Hindustani Musalmano Ka Jange-E-Azadi Mein Hissa, Syed Ibrhim Fikri, New Delhi, 1999, Page. 23). ఆ ఛాయా చిత్రాలను చాలా కాలం వరకు అన్సారీ కుమారులు ప్రజలకు, అధికారులకు చూపుతూ వచ్చారు.

రాష్ట్రపతి ఆజ్ఞల ఆచరణాత్మక అమలు కోరుతూ అధికారుల చుట్టూతా తిరగ్గా తిరగ్గా 1958లో బతఖ్ మియా అన్సారి కుటుంబం నివాసం ఉంటున్న సిస్వాఅజ్గరి (Siswa Ajgari) గ్రామంలో కాకుండా ఆ గ్రామానికి సుమారు వంద మైళ్ళ దూరంలో ఉన్న ఎక్వాపరస్వాని (Ekwaparsavni) లో ఆరు ఎకరాల భూమిని ప్రభుత్వం కేటాయించింది. బతక్ మియా కుటుంబం బ్రతుకు దెరువు సాగించడానికి మరో మార్గం లేక లభించిన అరకొర భూమిలో వ్యవసాయం చేసుకుని బ్రతకడానికి 1960లో ఎక్వాపస్రౌని గ్రామానికి తరలి వెళ్ళింది. ఆ భూమి కూడా అటవీశాఖ అభ్యంతరాలు పెట్టడంతో ఆరు సంవత్సరాల తర్వాత మాత్రమే అన్సారి కుమారులకు

స్వాధీనమయ్యింది. అది కూడా నదీ పరివాహక ప్రాంతంలో ఉండటంతో వ్యవసాయానికి యోగ్యం కాలేదు. అప్పటి నుండి బతఖ్ మియా అన్సారి వారసులు ప్రధమ రాష్ట్రపతి ఆదేశాలను పూర్తిగా అమలు చేయమంటూ రాష్ట్ర ప్రభుత్వాధినేతలను అభ్యర్థిస్తున్నా పట్టించుకున్న వారెవ్వరూ లేరు.

బతఖ్ మియా అన్సారికి డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్ చేసిన భూవితరణ గెజిట్ నోటిఫికేషన్ (27-01-1962) అయ్యింది. ఆ నోటికిఫికేషన్ ప్రతి అన్సారి కుమారుని వద్ద భద్రంగా ఉంది (Hindustani Musalmano Ka Jange-E-Azadi Mein Hissa, Syed Ibrhim Fikri, Page. 23). స్వయంగా జిల్లా కలక్టరుకు రాష్ట్రపతి జారీచేసిన ఆదేశాలు, ఆ ఆదేశాలను ధృవీకరిస్తూ ఆ తరువాత విడుదలైన ఉన్నతాధికారుల లేఖలన్నీ ఉన్నా కూడా అన్సారి కుటుంబానికి దక్కవలసిన భూమి పూర్తిగా దక్కనేలేదు. అలా నాలుగు దశాబ్దాల కాలం నిశ్శబ్దంగా కరిగిపోయింది.

1990లో ప్రధమ రాష్ట్రపతి ఆదేశాలను ఉటంకిస్తూ బీహార్ రాష్ట్ర అల్పసంఖ్యాక వర్గాల కమీషన్ బతఖ్ మియా అన్సారి కుటుంబానికి జరుగుతున్న అన్యాయాన్ని రాష్ట్ర ప్రభుత్వం దృష్టికి తెచ్చింది. ఆ సమయంలో మరోమారు రాష్ట్రపతి ఆదేశాల అమలు, బతఖ్‌మియా అన్సారి కుటుంబం గురించి బీహార్ రాష్ట్ర చట్టసభలలో చర్చ జరిగింది. ప్రసార మాధ్యమాల దృష్టి ఈ విషయం మీద పడింది. ఆ కారణంగా బతఖ్ మియా అన్సారి త్యాగం, సాహసం ప్రజల ఎరుకలోకి వచ్చింది. పర్యవసానంగా బతఖ్ మియా అన్సారి స్వగ్రామంలో ఆయన సమాధి నిర్మాణం జరిగింది. జిల్లా కార్యాలయంలో బతఖ్ మియా అన్సారి పేరిట సంగ్రహాలయం ఏర్పాటయ్యింది.

ఆ తరువాత బతఖ్ మియా అన్సారి సాహస గాధను, ఆయన కుటుంబానికి జరిగిన అన్యాయాన్ని వివరిస్తూ అష్రఫ్ ఖాద్రి (1990), సయ్యద్ ఇబ్రహీం ఫిక్రి (1999) తమ గ్రంథాల ద్వారా వెల్లడించారు. సయ్యద్ ఇబ్రహీం ఫిక్రి రాసిన Hindustani Musalmano Ka Jange-E-Azadi Mein Hissa గ్రంథం భారత ప్రభుత్వ మానవ వనరుల అభివృద్ధి సంస్థకు చెందిన విద్యావిభాగం ఆర్థిక సహాయంతో ప్రచురితమయ్యింది. ఈ గ్రంథంలో రాష్ట్రపతి లేఖలు, ప్రభుత్వ నోటిఫికేషన్లకు సంబంధించిన వివరాలు ఉన్నాయి. ప్రజలు, ప్రముఖులు, రచయితలు ఎవరెంత మొత్తుకున్నా ప్రభుత్వం మాత్రం మొద్దునిద్ర వీడలేదు. బతఖ్ మియా అన్సారి కుటుంబానికి న్యాయం జరగలేదు. చివరకు 2004లో బీహార్ శాసనసభలో కూడా బీహార్ బిడ్డడు, భారత ప్రధమ రాష్ట్రపతి రాజన్ బాబూ ఆదేశాల గురించి, ఆ ఆదేశాలు దశాబ్దాలుగా అమలు కాకపోవడం గురించి, బతఖ్ మియా అన్సారి కుటుంబానికి జరుగుతున్న ఆన్యాయం గురించి చర్చలు సాగాయి. ఆచరణాత్మక న్యాయం మాత్రం జరగలేదు. ఈ విషయం ప్రజలలో కొంతకాలం చర్చనీయాంశంగా మారి క్రమంగా జన సందోహపు మరుపు సముద్రంలో మరుగున పడిపోయింది.

ఒక దశాబ్దం తరువాత Family of Mahatma's Saviour in dire straits శీర్షికన 2010 జనవరి 22న మహాత్ముడి ప్రాణ రక్షకుడు బతఖ్ మియా అన్సారీ కుటుంబం దయనీయ స్థితిని వివరిస్తూ 'హిందూస్థాన్ టైమ్స్' (Hindustan Times) దినపత్రిక వార్తను ప్రచురించింది. ఆ వార్తకు అప్పటి రాష్ట్రపతి శ్రీమతి ప్రతిభా పాటిల్ కార్యాలయం స్పందించింది. రాష్ట్రపతి

ఆఫీసర్ అన్ స్పెషల్ డ్యూటీ (Officer on Special Duty) అర్చనా దత్తా (Archan Datta) ఈ విషయమై తూర్పు, పశ్చిమ చంపారన్ జిల్లా కలక్టర్లకు లేఖలు రాస్తూ ప్రథమ రాష్ట్రపతి ఆజ్ఞలను సత్వరమే అమలు పర్చమని ఆదేశించారు. ఆ ఆదేశాలు అందినాయని జిల్లా కలక్టర్లు, చివరకు ముఖ్యమంత్రి నితీష్ కుమార్ కూడా అంగీకరిస్తూ రాష్ట్రపతి ఆదేశాలను సత్వరమే పాటించనున్నామని కూడా ప్రకటించినా, ఆ ప్రకటనలు ప్రకటనలుగా మాత్రమే మిగిలిపోయాయి.

బతఖ్ మియా అన్సారి మూడవ తరం వారసులు ఈ నాటికి రాష్ట్రపతి ఆదేశాలు, ఆ ఆదేశాలను ధృవీకరిస్తున్న ఇతర ప్రభుత్వ అధికారిక పత్రాల దస్త్రాలను పట్టుకుని ప్రభుత్వ అధికారులు, ప్రభుత్వ కార్యాలయాలు, ప్రజా ప్రతినిధుల గడపల చుట్టూ కాళ్ళు అరిగిపోయేలా తిరుగుతున్నా సమస్య పరిష్కారానికి నోచుకోకుండా ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్టు ఉండి పోయింది. భారత ప్రథమ రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ ఆజ్ఞ పూర్తిగా అమలు జరగటం మాత్రం మహాత్మాగాంధీ ప్రాణ రక్షకుడు, సాహసి బతఖ్ మియా అన్సారి కుటుంబీకులకు ప్రస్తుతానికి దింపుడు కల్లం ఆశగా మిగిలిపోయింది.

◆ ◆ ◆

**భా**రత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రముఖ భూమిక నిర్వహించి 'జాతిపిత'గా ప్రజల నీరాజనాలు అందుకున్న మహాత్మాగాంధీ ప్రాణాలను రక్షించిన బతఖ్ మియా అన్సారి సంఘటన చరిత్ర పుటలలో సరిగ్గా నమోదు ఎందుకు కాలేదన్నది జవాబులేని ప్రశ్న. 1915లో దక్షణాఫ్రికా నుండి స్వదేశానికి విచ్చేసిన మహాత్ముడు తన జీవితకాలంలో జరిగిన ప్రతి సంఘటనను, ఆయా సంఘటనలలో పాత్రధారుల గురించి తన పుస్తకాలలో, లేఖలలో, పత్రికల్లో వివరంగా పేర్కొన్నారు. ప్రతిచిన్న విషయానికి స్పందించిన గాంధీజీ తన మీద ఆంగ్లేయ ఇండిగో ప్లాంటర్లు సాగించిన హత్యాయత్నం కుట్రను వమ్ముచేసి అన్ని అరిష్టాలను భరించిన బతఖ్ మియా అన్సారి గురించి ఎందుకు ప్రస్తావించలేదో అర్థం కాని విషయం. బతఖ్ మియా అన్సారి గురించి మాత్రమే కాదు చంపారన్ సత్యాగ్రహోద్యమం సందర్భంగా ఆయనకు సహకరించిన షేక్ గులాబ్, పీర్ మహమ్మద్ మూనీస్, హర్‌బన్స్ సహాహ్, శీతల్‌రాయ్ లాంటి ప్రముఖ రైతాంగ యోధుల గురించి కూడా తన రచనలలో మహాత్ముడు ప్రస్తావించక పోవడం విశేషం. దక్షణాఫ్రికా నుండి స్వదేశం వచ్చిన మోహన్ దాస్ కరంచంద్ గాంధీ దక్షణాఫ్రికా సంగతులు, ఆ తరువాత ఇండియా విచ్చేశాక ఇక్కడి విశేషాలను ఏకరువు పెడుతూ AN AUTOBIOGRAPHY or The Story of My Experiments with Truth శీర్షికన 1925లో ఆత్మకథ రాశారు. ఈ ఆత్మకథ రెండు భాగాలుగా 1927, 1929లో ప్రచురితమయ్యింది. 1993లో తెలుగులోకి తర్జుమా చేయబడిన ఈ గ్రంథంలో 'నీలిమందు మచ్చ', 'బీహారీల అమాయకత్వం', 'అహింసా దేవి సాక్షాత్కారం',' కేసు ఉపసంహరణ', 'కార్యవిధానం', 'అనుచరులు', 'గ్రామాలలో', 'ఉజ్వల పక్షం', 'కార్మికులతో సంబంధం' అను వేర్వేరు శీర్షికలతో చంపారన్ అనుభవాలను నిక్షిప్తం చేశారు. ఈ అనుబంధ శీర్షికలలో రైతాంగ

నాయకులు రాజ్‌కుమార్ శుక్లా గురించి గాంధీజీ ప్రస్తావించారు తప్ప బతఖ్ మియా అన్సారి, పీర్ ముహమ్మద్ మూనీస్ తదితరుల గురించి ప్రస్తావించక పోవడం విశేషం.

డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ కూడా చంపారన్ చరిత్ర, చంపారన్ సత్యాగ్రహం గురించి పుంఖాను పుంఖాలుగా రాసినా ఎక్కడా కూడా బతఖ్ మియా అన్సారి ప్రస్తావన చేయలేదు. మహాత్మాగాంధి మీద సాగిన హత్యాయత్నాన్ని బతఖ్ మియా వమ్ము చేసినప్పుడు డాక్టర్ రాజన్‌బాబు ప్రత్యక్ష సాక్షి. ఆ కారణంగానే 1950లో బహిరంగ సభలో ప్రజా సందోహం ముందు అత్యంత చారిత్రక ప్రాధాన్యత గల బతఖ్ మియా ఉదంతాన్ని రాష్ట్రపతి వెల్లడించారు. ఆ తరువాత బతఖ్ మియా అన్సారి కుటుంబం యోగక్షేమాల పట్ల శ్రద్ధ చూపిన డాక్టర్ ప్రసాద్ ఎందువల్ల బతఖ్ మియా అన్సారి త్యాగాన్ని, సాహసాన్ని తన గ్రంథాలలో ప్రస్తావించలేదో అర్థంకాదు.

చంపారన్ రైతాంగ పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొనటం మాత్రమే కాకుండా, ఆ పోరాట విశేషాలన్నిటిని ఆయా సందర్భాలలో అక్షరబద్ధం చేసి 'ప్రతాప్' తదితర పత్రికల ద్వారా ప్రజలకు చేరేవేసిన పాత్రికేయులు పీర్ ముహమ్మద్ మునీస్ కూడా బతఖ్ మియా అన్సారి ఉదంతాన్ని అక్షరీకరించ లేదు. మహాత్ముడు చంపారన్ సత్యాగ్రహోద్యమంలో సుమారు ఆరు మాసాలు/ తొమ్మిది మాసాలు గడిపారు. ఆ సమయంలో చంపారన్‌లో జరిగిన సంఘటనలన్నిటిని పీర్ ముహమ్మద్ మూనీస్ 'ప్రతాప్' వార/దిన పత్రికలో వెలువరించారు.

ఆంగ్లేయుల ఇష్టారాజ్యాన్ని రద్దుచేయడానికి విచ్చేసిన మహాత్మాగాంధీని విషాహారం ద్వారా హత్యగావించేందుకు రూపు దిద్దుకున్న కుట్ర, ఆ కుట్రను వమ్ముచేసిన బతఖ్ మియా అన్సారి, ఆ తరువాత ఇండిగో ప్లాంటర్ల క్రూరత్వానికి గురైన అన్సారి కుటుంబం పడినపాట్లు ఎందుకు రాయలేదన్నది సమాధానంలేని ప్రశ్న. ప్రముఖ చరిత్రకారుడు కె.కె.దత్తా (1905-1982) పీర్ మూనీస్ ఇంటి నుండి కొన్ని పత్రాలను, 'చంపారన్ చరిత్ర' శీర్షికన మునీస్ రాసిపెట్టుకున్న పుస్తకం, లేఖలను తీసుకుని వెళ్ళారు. ఆ ప్రతాలను, లేఖలను మూనీస్ రచనలుగా సంకలనం చేయ సంకల్పించారు. చంపారన్ చరిత్ర పుస్తకాన్ని ప్రచురించదలిచారు, కానీ 1934లో సంభవించిన భూకంపంలో ఆయన ఇంట ఉన్న పీర్ మునీస్ రచనలు, పత్రాలన్నీ విధ్వంసం అయ్యాయి. ఆ కారణంగా బతఖ్ మియా అన్సారి సంఘటన గురించి పీర్ మూనీస్ రాసారోలేదో తెలియటం లేదు. అయినప్పటికి చంపారన్ సత్యాగ్రహోద్యమ ప్రధాన సంఘటనలను, మాత్రమే కాదు ప్రతి అంశాన్ని ప్రతాప్ పత్రిక ద్వారా ప్రజల ఎరుకలోకి తెచ్చిన ఆయన గాంధీజీ ప్రాణ హరణకు జరిగిన భయంకర కుట్రను, ఆ కుట్ర బాబూ రాజేంద్ర ప్రసాద్ సమక్షంలో బహిరంగపర్చి మహాత్ముడిని ప్రాణాలను కాపాడిన అత్యంత ప్రాధాన్యత గల వార్తాంశాన్ని తన ప్రతాప్ పత్రికకు గాని మరొక ప్రతికకు గానీ పీర్ మూనీస్ ఎందుకు రిపోర్టు చేయలేకపోయారో అర్థం కాదు.

ఏది ఎలాగున్నా భారత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో తనదంటూ ప్రత్యేక అధ్యాయాన్ని నిర్మించుకున్న 'జాతిపిత' మహాత్మాగాంధీ ప్రాణాలను ఆంగ్లేయుల హత్యాయత్నం నుండి రక్షించిన బతఖ్ మియా అన్సారికి స్వాతంత్ర్యోద్యమ సాహిత్య చరిత్రలో తగినంత స్థానం లభించకపోవడం

చారిత్రక విషాదం. ఆనాటి సంఘటనకు ప్రత్యక్ష సాక్షిగా నిలచి, భారత ప్రధమ రాష్ట్రపతి హోదాలో డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ బహిరంగంగా అన్సారి సాహసాన్ని, త్యాగాన్ని బహిర్గతం చేసి, బతఖ్ మియా అన్సారి కుటుంబాన్ని ఆదుకుందామన్న సత్సంకల్పంతో వ్యవసాయ భూమిని దఖలు చేయమన్న ఆజ్ఞ ప్రజాస్వామిక ప్రభుత్వాల దస్త్రాలలో మగ్గిపోతూ, ఏడు దశాబ్దాల తరువాత కూడా పూర్తిగా అమలుకు నోచుకోకున్న వైనం అత్యంత విచారకరం. ◆

## ఆధార గ్రంథాలు

## Books:

01. Hindustani Musalmano ka Jang-e-Azadi Mein Hissa (Hindi), Syed Ibrahim Fikri, New Delhi, 1999.

02. Muslim Freedom fighters (English), Syed Ubaidur Rahaman, New Delhi, 2017.

03. The Immortals (Album in English and Telugu), Syed Naseer Ahamed, Azad House of Publicatons, Undavalli, Andhrapradesh, 2014.

04. Chirasmaraneeyulu (Telugu), Syed Naseer Ahamed, Azad House of Pub-licatons Vinukonda, Andhrapradesh, 2008.

05. Shek Gulab (Hindi), Afroz Alam Shahil, New Delhi, 2017.

06. Dalith Freedom Fighters, (English), Mohan Dass Namisharay, Gyan Pub lishing House, New Delhi, 2010

07. Mazharul Haque (English), Dr Aeyamuddin Ahmad and Dr Jata Sankar Jha, Publication Division, Govt of India, 1976.

08. The Muslim Elite (English), Ali Ashraf, Atlantic Publishers & Distribu tors, New Delhi, 1982.

09. Muslims and Freedom Movement In India (English), Kamta Chaubey, ghugh Publications, Allahabad, 1990.

10. Peer Muhammad Moonis Kalam Sathyagrahi (Hindi), Sreekanth, Prabhat Prakashan, New Delhi, 2017.

11. Sathyasodhana leka Athma Katha (Telugu), Mohandas Karamchand Gandhi, Telugu Translation by Vemuri Radhakrishnamurthy, Navajeval Publishing House, Ahamadabad, 1993.

12. Remembering Muslim Makers of Modern Bihar, Compiled & Edited by Dr. Mohammad Sajjad, Brown Book Publications, New Delhi, 2019.

13. An Autobiography, or The Story of My experiments with trugh, M K Gandhi, Navajeval Publishing House, Ahamadabad, 2004

## Articles :

01. Batakh Mian vs Nathuram Godse : How has India forgotten about the man who refused to poison Gandhi? - Ajaz Ashraf

02. On the 100th anniversary of the Champaran Satyagraha, the family of the man who saved Gandhi says the country has forgotten him.- S. Anoop.

03. Family of Mahatma's saviour in dire straits.-BV Murty, Hindustan Times

04. Batak Mian – forgotten patriot who saved Mahatma's life in 1917, Manzar Bilal, Two Circles.net., January 30, 2010.

05 The Forgotten Cook Who Paid Heavily For Refusing To Poison Mahatma Gandhim, Sanchari Pal January 30, 2018.

06. Unrewarded saviour and unsung hero, Sandeep Bhaskar, Deccan Herald, Oct 03 2009.

07. Pir Mohammad Munis: An organic intellectual activist of the Champaran Satyagraha, Mohammad Sajjad, Aligarh Muslim University, May 1, 2013.

08. Here's The Story Of Pir Muhammad Munis, A Hindi Journalist And Un sung Hero Of Champaran Satyagraha, Afroz Alam Sahil, Journalist, Delhi.

09. Champaran : Jis Admine Gandhi ki jan Bachaye, desh aur system use bhoolgaya (Hindi), Chandana Srivastav.

10. Mahathma Gandhi ki jaan Bachane vaale Bataq Miya Ansari (Hindi), Jabir Hussain, Patna, Bihar.

11. Champaran Sathyagraha : Retrieving Some Forgotten Heroes, Mohammad Sajjad and Afroz Alam Shahil, History and Sociology of South Asia 12 (1) 1-16, 2007, Jamia Millia Islamia, Sage Publications.

## Videos :

01. Batak Mian: Forgotten patriot who saved Bapu's life in 1917
https://www.youtube.com/watch?v=sj9Ajqk9Mp4

02. Mahatma Gandhi Ko Bachaane Waale Shakhm Ko Jaanatain Hain aap?
https://www.youtube.com/watch?v=qOCvxWNUqDI



## సయ్యద్ నశీర్ అహమ్మద్

**స**య్యద్ నశీర్ అహమ్మద్ నెల్లూరు జిల్లా అల్లూరు తాలూకా పురిణి గ్రామంలో 1955 డిసెంబరు 22న జన్మించారు. తల్లిదండ్రులు : షేక్ బీబిజాన్, సయ్యద్ మీరా మొహిద్దీన్. వ్యవసాయ కుటుంబం. చదువు : ఎం.కామ్., ఎల్ఎల్.బి., సాహిత్యరత్న (హిందీ)., డి.జె. వృత్తి : న్యాయవాది. ప్రవృత్తి పాత్రికేయుడు -రచయిత. ప్రస్తుత నివాసం : ఉండవల్లి – 522501, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

చిన్నతనం నుండి రాయడం ఆరంభించినా 1975లో 'మరోప్రపంచం' లిఖిత మాసపత్రికలో తొలిసారిగా కవితలు ప్రచురితం. 1976లో 'ప్రగతి' సచిత్ర వారపత్రిక, జయశ్రీ, జ్యోతి మాసపత్రికల్లో పలు కథానికలు, కార్టూన్లు చోటు చేసుకున్నాయి. అప్పటి నుండి పలు పత్రికల్లో కవితలు, గేయాలు, కథలు, రాజకీయ -సామాజిక-సాహిత్య-చరిత్ర-సమీక్షా వ్యాసాలు, పలు వ్యంగ్య చిత్రాలు ప్రచురితం. మిత్రుడు వివిస్సార్ అవధానితో కలసి 'మరో ప్రపంచం', 'భేరి' లిఖిత మాస పత్రికలు వెలువరించారు. రాష్ట్రంలోని పలు ప్రజా సంఘాలు, సంస్థలు నిర్వహించిన పత్రికలకు సంపాదకునిగా సేవలు అందించారు. స్వయంగా 2006 నుండి 2011 వరకు 'ఇండియా'మాసపత్రిక ప్రచురించారు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం జన సముదాయాల పాత్రను వివరిస్తూ, 1998లో గ్రంథ రచన, ప్రచురణ ప్రారంభించారు. అప్పటి నుండి 1. భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు, 2. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం మహిళలు, 3. భారత స్వాతంత్ర్యోద్యమం: ఆంధ్రప్రదేశ్ ముస్లింలు, 4. మైసూరు పులి: టిపూసుల్తాన్, 5. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం ప్రజా పోరాటాలు, 6. షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్, 7. భారత స్వాతంత్ర్య సంగ్రామం: ముస్లిం యోధులు-1, 8. చిరస్మరణీయులు, 9. 1857: ముస్లింలు, 10. అక్షరశిల్పులు. 11. చరితార్దులు (తెలుగు) / ది ఇమ్మోర్టల్స్ (ఆంగ్లం), 12. కువైట్ కబుర్లు, 13 బిస్మిల్-అష్ఫాఖ్ 14. పండిత రాంప్రసాద్ బిస్మిల్- అష్ఫాఖుల్లా ఖాన్, 15.అజాద్ హింద్ ఫౌజ్ ః ముస్లిం పోరాటయోధులు, 16. మహాత్మాగాంధీ ప్రాణరక్షకుడు ః బతఖ్ మియా అన్సారీ గ్రంథాలను వెలువరించారు. ఈ గ్రంథాలలో 12 గ్రంథాలు వివిధ సంస్థలు, వ్యక్తుల ద్వారా పునర్ముద్రణ అయ్యాయి.

'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు' శీర్షికతో నశీర్ రాసిన సుదీర్ఘ ఆంగ్ల వ్యాసం అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం ప్రచురించిన 'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింల పాత్ర' వ్యాససంపుటిలో చోటుచేసుకుంది. ఈ వ్యాసాన్ని పలు రాష్ట్రాలలోని వివిధ సంస్థలు, సంఘాలు, పత్రికలు తమ ప్రత్యేక సావినీర్స్‌లో స్థానం కల్పించాయి. ఆయన గ్రంథాలను పలు ప్రాంతాల పత్రికలు ధారావాహికంగా ప్రచురించాయి, ప్రచురిస్తున్నాయి.

ఈ గ్రంథాలలో షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్ గ్రంధం ఉర్దూ భాషలోకి అనువాదమయ్యింది. పండిత రాంప్రసాద్ బిస్మిల్- అష్ఫాఖుల్లా ఖాన్ గ్రంథం తెలుగు, ఆంగ్లం, ఉర్దూ భాషల్లో 20 వేల ప్రతులు ముద్రించి భారతదేశ వ్యాప్తంగా 250 పైగా వివిధ ప్రాంతాలకు ఉచితంగా పంపిణీచేయబడ్డాయి. తెలుగు-ఆంగ్ల భాషల్లో 2014లో వెలువడిన 'చరితార్దులు' ఆల్బమ్ జాతీయంగా, అంతర్జాతీయంగా విశేష ఆదరణ పొందిన ఈ ఆల్బమ్ ఉర్దూ, తమిళం, హిందీ, గుజరాతి, మరాఠి భాషల్లో వెలువడనుంది.

ప్రస్తుతం 01) చరితార్దులు- 2, 02) చిరస్మరణీయులు-2, 03) భారత స్వాతంత్ర్యసంగ్రామం ః ముస్లిం యోధులు-2, 04) చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు, 05) మాతృభూమి సేవలో కృతార్థులైన ముస్లిం ముద్దు బిడ్డలు, 06) దక్షణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతః దాదా అమీర్ హైదర్ ఖాన్, 07)

భారతీయ ముస్లింలు-స్థితిగతులు, 08) భారతీయ ముస్లిం సమాజం ః అపోహలు-వాస్తవాలు గంథ్రాలను ఆయన వెలువరించనున్నారు.

గత రెండు దశాబ్దాలుగా ఆయన సాగిస్తున్న కృషికి గుర్తింపుగా 1) వి.ఆర్ నార్ల విశిష్ట జర్నలిస్టు అవార్డు (విజయవాడ, 2004), 2) తెలుగు భాషా పురస్కారం (గుంటూరు, 2007), 3) డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ఫెలోషిప్ అవార్డు (న్యూఢిల్లీ, 2008), 4) స్వాతంత్ర్య సమరయోధుడు అష్ఫాఖుల్లా ఖాన్ స్మారక అవార్డు (హైదరాబాద్, 2010), 5) బి.యస్ రాములు పురస్కారం (హైదరాబాద్, 2011), 6) కవికోకిల చిన సుబ్బయ్య స్మారక పురస్కారం (గుంటూరు, 2012), 7) సంఘమిత్ర అవార్డు (బుక్ ఆఫ్‌స్టేట్ రికార్డ్స్, హైదరాబాద్, 2013), 8) మాస్టార్‌జీ ఫౌండేషన్ సేవారత్న పురస్కారం, (విశ్వజన కళా మండలి, హైదరాబాద్, 2015), 9). జీవిత సాఫల్యా పురస్కారం (శ్రీమతి జ్యోతిబాయి పూలే ఎడ్యుకేషనల్, చారిటబుల్ ట్రస్ట్, విశాఖపట్నం, 2016), 10) ఉగాది పురస్కారం (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, 2016), 11) విశిష్ట సేవాపురస్కారం (నరసరావుపేట కళావేదిక, 2016), 12) జనోపకారి ఆత్మీయ పురస్కారం (జనోపకారి మాసపత్రిక, కావలి, 2016), 13) ఫ్రౌడ్ ఆత్మీయపురస్కారం (హైదరాబాద్ 2016), 14) లోక్ బంధు సద్భావనా సమ్మాన్ జాతీయపురస్కారం (లక్నో, ఉత్తరప్రదేశ్ 2017), 15) కీర్తి పురస్కారం (పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ 2015), 16) 'మహారాష్ట్ర బుక్ ఆఫ్ రికార్డ్స్'(కవితాసాగర్ పబ్లికేషన్స్, జయసింగ్‌పూర్, మహారాష్ట్ర, 2018.), 17) 'సృజన ప్రియ పురస్కారం'. (సృజనప్రియ మాసపత్రిక,హైదరాబాద్, 2018). 18) 'డాక్టర్ పట్టాభి ప్రతిభా పురస్కారం' డాక్టర్ పట్టాభి కళాపీఠం, విజయవాడ, 2018), 19) రాష్ట్రస్థాయి ఉత్తమ తెలుగు జర్నలిస్టు అవార్డు (కడప, 2018), 20) 'మాటి రతన్ పురస్కారం-2018' (అష్ఫాఖుల్లా ఖాన్ స్మారక అమర వీరుల పరిశోధనా సంస్థ, ఫైజాబాద్, ఉత్తరప్రదేశ్, 2018) అందుకున్నారు.

భారత ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల సమాచారాన్ని ప్రజలందరికి అందజేయాలన్న లక్ష్యంతో భారతదేశం అంతటా వివిధ సంస్థల, వ్యక్తుల ఆహ్వానం మేరకు స్వాతంత్ర్య సమరయోధుల చిత్రపటాల ప్రదర్శనల ఏర్పాటు చేస్తున్నారు. విద్యార్థులు తమ పుస్తకాలకు అంటించుకునే 'నేమ్ స్టికర్లు', స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రత్యేకత సృష్టించుకున్న యోధుల వివరాలతో కూడిన క్యాలెండర్లు, చిరు పొత్తాలను మిత్రులు, వివిధ సంస్థల సహాయ సహకారాలతో ప్రచురించి దేశవ్యాప్తంగా ఉచితంగా పంపిణి చేశారు. ఈ మేరకు 'పండిత రాంప్రసాద్ బిస్మిల్-అష్ఫాఖుల్లా ఖాన్' పుస్తకాన్ని తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లో 20 వేలు ప్రతులు పంపిణి అయ్యాయి. మన పూర్వీకుల త్యాగమయ-సాహసోపేత చరిత్రలను ప్రజల ప్రధానంగా బాలబాలికల, యువత ఎరుకలోకి తెచ్చేందుకు ఆచరణాత్మక కార్యక్రమాల ద్వారా గత 21 ఏండ్లుగా కృషి సల్పుతున్నారు. ఆయన గ్రంథాల పిడియఫ్ ఫైల్స్‌ను కోరిన వారికి ఉచితంగా అందిస్తున్నారు. అంతర్జాలంలో రెండు వెబ్‌సైట్లు ఏర్పాటు చేయించి పుస్తకాలను ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకునే వీలు కల్పించారు.

సయ్యద్ నశీర్ అహమ్మద్ రచయిత, నటుడు, చిత్రకారుడు, వ్యంగ్యచిత్రకారుడు, వక్త, సంపాదకుడు, పాత్రికేయుడు, న్యాయవాది, చరిత్రకారుడు, సామాజిక సేవాకార్యకర్తగా వివిధ రంగాలకు సేవలు అందిస్తున్నారు. అంతర్జాతీయ-జాతీయ-ప్రాంతీయ సభలు, సమావేశాలు, సదస్సులలో పాల్గొన్నారు. ఆర్థిక-సామాజిక అసమానతలు లేని లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థ నిర్మాణంలో రచయితగా భాగస్వామ్యం అందించడం, జ్ఞానం ప్రజాస్వామీకరించబడాలన్న ఆకాంక్షతో అవిశ్రాంతంగా రచనా వ్యాసంగం సాగిస్తున్నారు.

**- ప్రచురణకర్తలు**